# మహాకవి సందేశము

సంకలనము

ఆర్షవిద్యాభూషణ
జటావల్లభుల పురుషోత్తము, ఎం.ఏ.




ప్రచురణ
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి

1994

# ముందుమాట

సంఘజీవి అయిన మానవుని లోని స్వార్థం, అహంభావం, ఈర్ష్య, అసూయాద్వేషాలు వగైరా ఆసురగుణాలు నశించి వాటి స్థానంలో త్యాగం, సహనం, ఔదార్యం, కరుణ ఆదిగాగల దైవీగుణాలు చోటు చేసుకున్నప్పుడే అతను ఉత్తమ మానవుడవుతాడు. అతని జీవితానికి సార్థకతా సిద్ధిస్తుంది. తరతరాల మానవ సుదీర్ఘ జీవిత పరిశీలనం వల్ల మనుష్య ప్రవృత్తినీ, లోకపు తీరునూ అవగాహన చేసుకున్న మన భారతీయ ఋషులు, ఋషితుల్యులైన కవులు వేదవేదాంగాలు, భారత భాగవత రామాయణాలు, కావ్య నాటక పురాణాలు రచించి (వేదాల్ని ఋషులు దర్శించారు. అవి అపౌరుషేయాలు) వాటి ద్వారా సామాజిక శ్రేయస్సును ఆకాంక్షిస్తూ మానవుడు తన మనుగడను ఏ ఉన్నతమార్గంలో సాగించాలో ఉపదేశించారు. ఆ మహనీయుల రచనలు భారతీయ విజ్ఞాన సంపదనూ, సంస్కృతీ సౌరభాన్నీ వెదచల్లుతూ సార్వకాలికాలు, సార్వజనీనాలుగా కూడ ప్రతిభాసిస్తూ వున్నాయి.

ఈ గ్రంథాలన్నీ, ప్రపంచ వాఙ్మయాల్లో ప్రకృష్టమైందని ప్రశంసింపబడుతూవున్న సంస్కృత భాషలో వుండడం విశేషం. విశ్వశ్రేయాన్ని కోరే ఈ సారస్వతంలో ఆణిముత్యాల్లాంటి సూక్తులూ, ఉపదేశాలూ తీగపాడవున విరిసిన సన్నజాజుల్లాగా దర్శనమిస్తూ మనకు మార్గదర్శకాలై ధర్మాసక్తినీ కర్తవ్యబుద్ధినీ కలిగిస్తున్నాయి.

ఆర్షవిద్యాభూషణ శ్రీ జటావల్లభుల పురుషోత్తంగారు రామాయణాదుల్లోని అమూల్యమైన ఉపదేశాల్ని సేకరించి వాటికి తెలుగు భాషలో సంగ్రహంగా సరళంగా తాత్పర్యాలు వ్రాశారు. సంస్కారవంతుడుకాగోరే ప్రతివ్యక్తి ఈ ఉపదేశాల్ని ఆచరణలో పెట్టాలనే అభిప్రాయంతో తి.తి. దేవస్థానముల వారీ గ్రంథాన్ని ప్రచురించడం జరిగింది. చదువరులు మేమందిస్తున్న ఈ మహాకవుల సందేశామృతాన్ని ఆస్వాదిస్తారని ఆశిస్తున్నాము.

డి.వి.ఎల్.ఎన్. మూర్తి<br>కార్యనిర్వహణాధికారి,<br>తి.తి. దేవస్థానములు.

తిరుపతి,<br>14-9-94

# విషయసూచిక



---

# ఈ గ్రంథంలోని కవుల్ని గూర్చి ఒకటి రెండు మాటలు

## 1. వాల్మీకి:

లౌకిక సంస్కృతభాషలో ప్రప్రథమంగా ఉదయించిన రామాయణ మహాకావ్యకర్త వాల్మీకి. అందుచేత ఈయన్ని ఆదికవిగా పండితులు ప్రస్తుతించారు. వాల్మీకి మొదట్లో దారులుకొట్టి జీవించేవాడనీ, ఒకానొక సంఘటన కారణంగా ఇతనిలో మార్పు వచ్చిందనీ ఐతిహ్యం. ఈ మహర్షి భారతదేశంలోని తూర్పు ఈశాన్య ప్రాంతాలకు చెందినవాడనీ, గంగానది సమీపంలోని తమసానదీతీరంలో ఇతని ఆశ్రమం వుండేదనీ విజ్ఞుల అభిప్రాయం. ఈ కవీంద్రుని కాలాన్ని గూర్చి క్రీ॥ పూ॥ 500 సం॥కు పూర్వమని మాక్‌డొనెక్, క్రీ॥ పూ॥ 3వ శతాబ్దమని కీథ్, క్రీ॥ పూ॥ 5వ శతాబ్దికి పూర్వమని మోనియర్ విలియమ్స్, క్రీ॥ పూ॥ 800 - 900 సం॥ల మధ్యకాలమని యాకోబి, మున్నగు విమర్శకులు ఉద్దేశపడ్డారు. ఈ మహాకవి కాలం ఏదైనా రామాయణంలాంటి మహోత్తమ కావ్యాన్ని భారతజాతి కందించిన మహాత్ముడుగా ఈయన మనకు ప్రాతఃస్మరణీయుడు.

## 2. కాళిదాసు:

సంస్కృతభాషలో ఈ కవికులతిలకునికి పోటీవచ్చే మరోకవి లేడని విద్వాంసుల అభిప్రాయం. ఇతని కాలాన్ని గూర్చి విమర్శకులలో ఏకాభిప్రాయం లేదు. క్రీ॥ పూ॥ 150వ సం॥ నుండి క్రీ॥ శ॥ 634 మధ్యకాలంలో జీవించాడని మాక్స్ ముల్లర్ మొ॥ పండితులు పేర్కొన్నారు. ఋతుసంహారం, కుమారసంభవం, రఘువంశం, మేఘదూతం, మాళవికాగ్నిమిత్రం, విక్రమోర్వశీయం, అభిజ్ఞానశాకుంతలం - ఈయన రచనలు. 'ఉపమా కాళిదాసస్య' అనే ప్రశస్తి కాళిదాసుకుంది.

3. భర్తృహరి:

ఇతనికాలాన్ని గూర్చి విమర్శకులలో అభిప్రాయభేదాలున్నాయి. క్రీ॥ పూ॥ ప్రథమ శతాబ్దమని కొందరూ, క్రీ॥ శ॥ 691 ప్రాంతమని మరికొందరూ అంటున్నారు. ఈ మహాకవి రచించిన నీతి, శృంగార, వైరాగ్యశతకాల సంపుటికి (సుభాషిత త్రిశతి) సంస్కృత వాఙ్మయంలో ఒకవిశిష్ట స్థానముంది. మానవజీవితంలోని బాల్య కౌమార యౌవన వృద్ధాప్య దశలన్నిటికీ ప్రేరణనూ, స్ఫూర్తినీ కలిగించే ఈ శతకం బహుజనామోదాన్ని పొందింది.

4. భారవి:

సంస్కృతభాషలోని ప్రౌఢకవులలో ఇతడొకడు. కిరాతార్జునీయమనే 18 సర్గల మహాకావ్యం ఈ కవిరచన. క్రీ॥ శ॥ 634 ప్రాంతానికి చెందిన భారవి కవితను "భారవేరర్థ గౌరవమ్' అని విజ్ఞులు ప్రశంసించారు. శక్తివంతమైన పదప్రయోగం, భావప్రకటనా సామర్థ్యం ఇతని సొమ్ములు.

5. వేదాంతదేశికులు:

క్రీ॥ శ॥ 1268 - 1369 సం॥ల మధ్యకాలంలో జీవించిన ఈ భాగవతోత్తముడు రామానుజుల తర్వాత అంతటి మహనీయుడు. దశాధిక గ్రంథకర్తయైన ఈ కవీశ్వరుని రచనలలో సంకల్ప సూర్యోదయ నాటకం, హంస సందేశం, పాదుకా సహస్రం, గరుడ దశకం, రఘువీరగద్యం, అచ్యుత శతకం, సుభాషితనీతి, వైరాగ్యపంచకం మున్నగునవి పన్నెకెక్కాయి.

6. శంకరాచార్యులు:

అద్వైత మతస్థాపకుడైన ఈయన జగద్గురువులు. క్రీ॥ శ॥ 8వ శతాబ్దికి చెందిన ఈ మహాత్ముడు గొప్ప దార్శనికుడు. ప్రస్థానత్రయానికి వీరు రచించిన భాష్యం సాటిలేనిదని విద్వాంసుల మాట. శివానందలహరి, లక్ష్మీనృసింహస్తోత్రం మున్నగునవి వీరి రచనలు.

## 7. వాణీ కదంబకం:

మహాభారతాది గ్రంథాల్లోని శ్లోకాలిందు సంకలించబడ్డాయి.

## 8. వ్యాసుడు:

ప్రపంచ సాహిత్యాల్లో వెలసిన ఐతిహాసిక కావ్యాల్లో ప్రథమస్థానాన్ని ఆక్రమించగల్గిన మహాభారతం ఈ మహర్షి రచన. కృష్ణద్వైపాయనుడని ఈయనకు పేరు. వ్యాసుడనేది వేదవిభజన చేయటం వల్ల వచ్చిన బిరుద నామం. పరాశరముని అనుగ్రహంతో సత్యవతికి సద్యోగర్భంలో ఈ ముని జన్మించాడు. క్రీ॥ శ॥ 1200 - 1100 సం॥ల నడిమికాలంలో ఈ మహాకవి జీవించాడని అధిక సంఖ్యాకులైన విమర్శకులు పేర్కొన్నారు. మానవ మనస్తత్వానికి ప్రతిబింబమనదగిన భారతేతిహాసాన్ని భారతజాతి కందించిన వ్యాసభగవానుడు చిరస్మరణీయుడు.

డి. నాగసిద్ధారెడ్డి

# మహాకవి సందేశము

## వాల్మీకి మహర్షి వాణి

### 1. సతీ హృదయము

తనతో అరణ్యమునకు రావలదని రాముడు వారింపగా, సీత ప్రేమ మూలకముగానే కోపము తెచ్చుకొని (ప్రణయాదేవ సంక్రుద్ధా) ప్రాణేశ్వరునితో నిట్లనెను.

ఆర్యపుత్ర పితా మాతా
భ్రాతా పుత్రస్తథా స్నుషా,
స్వాని పుణ్యాని భుంజానాః
స్వం స్వం భాగ్య ముపాసతే. (అయో. 27-4)

ఆర్యపుత్ర, లోకములో తల్లి, తండ్రి, సోదరుడు, పుత్రుడు కోడలు - తమతమ పుణ్యములనే తా మనుభవించుచు తమ భాగ్యమునే తాము సేవించుకొనుచుందురు.

భర్తుర్భాగ్యం హి భార్యైకా
ప్రాప్నోతి పురుషర్షభ,
అతశ్చైవాహ మాదిష్టా
వనే వస్తవ్య మిత్యపి. 5

భార్యమాత్రమే భర్తయొక్క భాగ్యమును పొందును. కావున నేను నీతో అరణ్యమునకు వచ్చుట ధర్మము.

న పితా నాత్మజో నాత్మా
న మాతా న సఖీజనః,
ఇహ ప్రేత్య చ నారీణాం
పతిరేకో గతి స్సదా. 6

ఇహలోకముననను, మరణానంతరముననుగూడ స్త్రీలకు పతియే గతి; తండ్రి, కుమారుడు తల్లి, సఖీజనము-గతికాదు. తుదకు తానుకూడ తనకు గతి కాదు.

యది త్వం ప్రస్థితో దుర్గం
వన మద్యైవ రాఘవ,
అగ్రతస్తే గమిష్యామి
మృద్నన్తీ కుశకంటకాన్. 7

అరణ్యమార్గము దుర్గమమును, కంటకావృతము నగుచో నేను నీకు ముందు నడచుచు దర్భలను, ముండ్లను తీసివేయుచుందును.

ఈర్ష్యారోషౌ బహిష్కృత్య
భుక్తశేష మివోదకమ్,
నయ మాం వీర విస్రబ్ధః
పాపం మయి న విద్యతే. 8

పాత్రలోని, త్రాగగా మిగిలిన నీటిని పారవైచునట్లు నేను ఈర్ష్యా రోషములను విడచి (మన మరణ్యములో నుండగా నిచట హాయిగా నున్న స్వజనముపట్ల ఈర్ష్యను, వనవాసమునకు కారకులైన కైకేయీ దశరథాదులపట్ల రోషమును పొందనిదానినై) నీతోడ వచ్చెదను. సంకోచింపక నీవు నన్ను తీసికొనివెళ్ళుము. నాయందేమియు దోషములేదు.

అనుశిష్టాస్మి మాత్రాచ
పిత్రాచ వివిధాశ్రయమ్,
నాస్మి సంప్రతి వక్తవ్యా
వర్తితవ్యం యథా మయా. 10

ఏ సందర్భమున నెట్లు ప్రవర్తింపవలయునో నా తల్లి దండ్రులు బోధించియున్నారు. ఇపుడు నేనెట్లు సంచరింపవలయునో నీవు చెప్పనక్కరలేదు.

అహం దుర్గం గమిష్యామి
వనం పురుషవర్జితమ్,
నానా మృగ గణాకీర్ణం
శార్దూల వృకసేవితమ్. 11

సుఖం వనేనివత్స్యామి
యథైవ భవనే పితుః,
అచింతయంతీ త్రీన్ లోకాం
శ్చింతయంతీ పతివ్రతమ్. 12

అరణ్యము -- దుర్గమము, మనుష్య సంచారరహితము, నానా మృగాకీర్ణము, శార్దూలవృకసేవితము - అయినను నేను వచ్చెదను.

నా తండ్రి యింటనుండినంత సుఖముగా నే నచ్చట నుండెదను. ముల్లోకములలోని సౌఖ్యములను గణింపక, పతిసేవావ్రతమునే చింతించుచు నేను నీతో అరణ్యమున నివసించెదను.

శుశ్రూషమాణా తే నిత్యం
నియతా బ్రహ్మచారిణీ,
సహ రంస్యే త్వయా వీర
వనేషు మధుగంధిషు. 13

ఓ వీరాగ్రణీ! నే నెల్లపుడు నీకు సేవచేయు కోరిక తోనే నీ తోడ నుండదలంచితిని. బ్రహ్మచర్యము నవలంబించెదను. నియమములను పాటించెదను. ఆ రీతిగానే నీతో మకరందపరిమళము గల్గిన వనములలో క్రీడించెదను.

త్వం హి శక్తో వనే కర్తుం
రామ సంపరిపాలనమ్,
అన్యస్యాపి జనస్యేహ
కిం పున ర్మమ మానద. 14

ఓ రామ, నీ వితరులనే సంరక్షింపగలవాడవు, అరణ్యములో నన్ను రక్షించుకొనజాలవా?

సహ త్వయా గమిష్యామి
వనమద్య న సంశయః,
నాహం శక్యా మహాభాగ
నివర్తయితు ముద్యతా. 15

నిస్పందేహముగ నేను నీతో నరణ్యమునకు వచ్చెదను. ఓ మహాన భావా! నన్ను మాన్పించుట నీకు శక్యము కాదు.

ఫలమూలాశనా విత్యం
భవిష్యామి వ పంశయః,
వ తే దుఃఖం కరిష్యామి
వివపన్తీ పహ త్వయా. 16

నీ కేమియు కష్టము కలుగకుండునట్లు నేను నీతో నుండెదను. దుంపలను, పండ్లను భుజించెదను.

ఇచ్ఛామి పరిత శ్శైలావ్
పల్వలావి వవావి చ,
ద్రష్టుం పర్వత్ర విర్భీకా
త్వయా వాథేవ ధీమతా. 17

బుద్ధిమంతుడవు, రక్షకుడవైన నీతో గూడి యెల్లెడల నిర్భయురాలనై నదులను, పర్వతములను, మడుగులను వనములను చూడగోరుచున్నాను.

అభిషేకం కరిష్యామి
తాసు విత్యం యతవ్రతా,
పహ త్వయా విశాలాక్షి!
రంప్యే పరమవందివీ. 19

నియమిత వ్రతములు కలదాననై యా నదులలో స్నానమాచరించు చుండెదను. ఓ విశాలాక్షా! పరమానందముగలదాననై నేను నీతో క్రీడించెదను.

ఏవం వర్షపహస్రాణాం
శతం వాఽహం త్వయా పహ,
వ్యతిక్రమం వ వేత్స్యామి
స్వర్గోఽపి వహి మే మతః. 20

ఓ రాఘవా! యీరీతిగా పదునాలుగు సంవత్సరములుకాదు, లక్షల కొలది సంవత్సరములనైనను నీతో నేను నివసింపగలను. నాకు తెలియ కుండగనే కాలము గడచి పోవును. స్వర్గమునకూడ నేను కోరను.

## 2. సమాశ్వాసనము

పితృమరణ వ్యథితుడైన భరతుని చిత్రకూట పర్వతమున రామచంద్రు డోదార్చుచు పల్కిన మాటలు:

నాఽత్మనః కామకారోఽస్తి
పురుషోఽయ మనీశ్వరః,
ఇత శ్చేతరత శ్చైనం
కృతాన్తః పరికర్షతి. (అయో. 105-15)

మానవుడు తన యభీష్టము లన్నింటిని చెల్లించుకొనుటకు సమర్థుడు కాడు. విధి యాతని నిటునటు లాగుచుండును.

సర్వే క్షయాన్తా నిచయాః
పతనాంతాః సముచ్ఛ్రియాః,
సంయోగా విప్రయోగాన్తాః
మరణాంత చ జీవితమ్. 16

కూడబెట్టిన వస్తువులన్నియు తుదకు నశింపవలసినవే. పొంగు లన్నియు చివఱకు క్రుంగవలసినవే. సంయోగము లన్నియు నెప్పటికైనను వియోగములుగా మారవలసినవే. జీవిత మెప్పుడైనను మరణమున పర్యవసానము కావలసినదే.

యథా ఫలానాం పక్వానాం
నాన్యత్ర పతనా ద్భయమ్,
ఏవం నరస్య జాతస్య
నాన్యత్ర మరణా ద్భయమ్. 17

పండిన పండునకు పతన భయము తప్పదు, మరొక భయములేదు. అట్లే జన్మనొందిన మానవునకు మృత్యువునుండియే భయము.

అత్యేతి రజనీ యా తు
సా న ప్రతినివర్తతే,
యాత్యేవ యమునా పూర్ణా
సముద్రముదకాకులమ్. 19

గడచిపోయిన రాత్రి తిరిగిరాదు. సముద్రమును చేరిన నది వెనుకకు మరలిరాదు.

అహోరాత్రాణి గచ్ఛన్తి
సర్వేషాం ప్రాణినా మిహ,
ఆయూంషి క్షపయన్త్యాశు
గ్రీష్మే జల మివాంశవః
20

అహోరాత్రములు గడచుచు, గ్రీష్మర్తువులలో సూర్యకిరణములు జలకణములను పీల్చివైచునట్లు సర్వప్రాణులయొక్క ఆయువును పీల్చివైచుచున్నవి.

ఆత్మాన మనుశోచ త్వం
కిమన్య మనుశోచసి,
ఆయుస్తే హీయతే యస్య
స్థితస్య చ గతస్య చ.
21

ఎవరిసంగతినో యాలోచింపనేల? నీ సంగతినే యాలోచించుకొనుము. నీవు నిలుచున్నంతకాలము, నడచుచున్నంత కాలము నీ యాయువు తరిగి పోవుచునే యున్నది.

నందంత్యుదిత ఆదిత్యే
నందంత్యస్తమితే రవౌ,
ఆత్మనో నావబుద్ధ్యన్తే
మనుష్యా జీవితక్షయమ్.
24

మనుష్యులు సూర్యు డుదయించుచుండగా సంతోషించుచున్నారు; సూర్యుడస్తమించుచుండగా సంతోషించుచున్నారు. ఒక్క సూర్యోదయముతోను, ఒక్క సూర్యాస్తమయముతోను, తమ జీవితము తరిగిపోవుచున్నదని వారు గుర్తింపజాలకున్నారు.

హృష్యన్త్యృతుముఖం దృష్ట్వా
నవం నవ మిహాగతమ్,
ఋతూనాం పరివర్తేన
ప్రాణినాం ప్రాణసంక్షయః
25

ఒక ఋతువుపోయి క్రొత్త ఋతువు వచ్చునపుడు ప్రజలు సంతోషించుచున్నారు. ఋతుపరివర్తనముతో పాటు, ప్రాణుల ఆయుర్దాయము కూడ క్షీణమగుచున్నది.

యథా కాష్ఠం చ కాష్ఠం చ
సమేయాతాం మహార్ణవే,
సమేత్యచ వ్యపేయాతాం
కాల మాసాద్య కంచన. 26

ఏవం భార్యాశ్చ పుత్రాశ్చ
జ్ఞాతయశ్చ వసూని చ,
సమేత్య వ్యవధావన్తి
ధ్రువో హ్యేషాం వినా భవః. 27

మహాసముద్రములో నొక కట్టియు మఱొక కట్టియు నెక్కడెక్కడి నుండియో వచ్చి, యొకచోట కలసి కొంతసేపయినతర్వాత, కాలవశమున విడిపోవుచు దేని దారి నది పోవుచున్నవో, యట్లే భార్యలు పుత్రులు, జ్ఞాతులు, ధనములు కొంతకాలము మనుజునితో కలిసియున్నను తిరిగి విడిపోవుట నిశ్చయము.

ఏవం పూర్వైర్గతో మార్గః
పితృపైతామహో ధ్రువః,
త మాపన్నః కథం శోచే
ద్యస్య నాస్తి వ్యతిక్రమః 30

ఆదినుండియు పితృ పైతామహముగా వచ్చుచున్న యీ మృత్యుమార్గము తిరుగులేనిది. దీనిని గూర్చి విచారింపనేల?

ధర్మాత్మా స శుభైః కృత్స్నైః
క్రతుభి శ్చాప్తదక్షిణైః,

ధూతపాపో గతః స్వర్గం
పితా నః పృథివీపతిః 32

మన తండ్రి ధర్మాత్ముడు; విధివిహితముగా దక్షిణోపేతములైన పుణ్యప్రదములైన సమస్తయజ్ఞములను ఆచరించి పాపరహితుడై స్వర్గమును పొందియున్నాడు.

* * *

# కాళిదాసవాణి

## 1. రఘువంశ రాజుల వర్ణనము

సోఽహ మాజన్మ శుద్ధానా
మాఫలోదయ కర్మణామ్,
ఆసముద్రక్షితీశానా
మానాక రథవర్త్మనామ్. రఘు. 1-5

రఘువంశ రాజులు జీవిత మధ్యకాలమున పవిత్రత నలవఱచు కొన్న వారు కాదు; జన్మారంభమునుండియు పరిశుద్ధులే. తాము పూనిన కార్యమును ఫలసిద్ధి యగువఱకు విడచువారు కాదు. సముద్రపర్యంత భూమికి ప్రభువులు; వారి రథములు స్వర్గలోక పర్యంతము సంచరింపగలవు.

యథావిధి హుతాగ్నీనాం
యథాకామార్చి తార్థినామ్,
యథాపరాధ దండానాం
యథాకాల ప్రబోధినామ్. 6

వారు శాస్త్రము ననుసరించి హోమము చేయువారు; కోరికల ననుసరించి యతిథులను పూజించువారు; నేరము ననుసరించి దోషులను దండించువారు; సమయము ననుసరించి మేల్కొనువారు.

త్యాగాయ సంభృతార్థానాం
సత్యాయ మితభాషిణామ్,
యశసే విజగీషూణాం
ప్రజాయై గృహమేధినామ్. 7

వారు త్యాగము చేయుటకొఱకే ధనమును సంపాదించువారు; ఎక్కువగా మాట్లాడుచో నసత్యము నోటినుండి దొర్లునేమో యను భీతిచే మితభాషులుగా నుందువారు; సత్పురుషులు కీర్తింపదగిన పద్ధతిలోనే శత్రువులను జయింపగోరువారు; పితృణ విమోచనమునకై పుత్రులను గనుటకును, వారికి విద్యాబుద్ధులను గఱపుటకును గృహస్థాశ్రమములో నుండిరి; కాని కేవల కామపురుషార్థముకొఱకు కాదు.

శైశవేఽభ్యస్త విద్యానాం
యౌవనే విషయైషిణామ్,
వార్ధకే మునివృత్తీనాం
యోగేనాన్తే తనుత్యజామ్. 8
(రఘూణాం మన్వయం వక్ష్యే)

వారు బాల్యములో నభ్యసింపబడిన విద్యలు గలవారు; యౌవనములో శాస్త్రసమ్మతమైన విషయసుఖముల ననుభవించెడివారు; వార్ధకమందు గృహమును వీడి వానప్రస్థాశ్రమము స్వీకరించి తపస్సు చేసికొనెడివారు; మరణ సమయమున యోగధారణచే బ్రహ్మానుసంధానము చేయుచు శరీర త్యాగము చేయువారు.

(అట్టి రఘువంశరాజుల వంశచరితమును వర్ణించెదను.)

---

## 2. దిలీపమహారాజు శీలము

దుదోహ గాం స యజ్ఞాయ
సస్యాయ మఘవా దివమ్,
సంపద్వినిమయే నోభౌ
దధతు ర్భువనద్వయమ్. 1-26

ఆ దిలీపుడు దేవతలను తృప్తిపఱచుటకై భూలోకములో సార భూత ములైన వస్తువులను యజ్ఞములో నర్పించెను. దానికి ఫలితముగా దేవేంద్రుడు సస్యసమృద్ధికరమైన వర్షములను కురిపించెను. ఇట్లు ఇంద్ర దిలీపు లిద్దరును తమ తమ సంపదల నొండొరుల కర్పించు కొనుచు రెండు లోకములను చక్కగా పోషించిరి.

ద్వేష్యోఽపి సమ్మత శ్శిష్టో
తస్యార్తస్య యథౌషధమ్,
త్యాజ్యో దుష్టః ప్రియోఽప్యాసీ
దంగుళీ వోరగక్షతా. 28

ఔషధము చేదుగా నున్నను రోగి దానిని సేవించునట్లు, శత్రువైనను శిష్టుడగుచో వానిని దిలీపు డాదరించుచుండెను. వ్రేలిపై పాము కాటు వేయుచో, మానవు డా వ్రేలును ఛేదించుకొనునట్లు తనకు ప్రేమాస్పదుడైనను దుష్కార్యము చేయుచో వాని నాతడు పరిత్యజించు చుండెడివాడు.

స త్వం మదీయేన శరీరవృత్తిం
దేహేన నిర్వర్తయితుం ప్రసీద,
దినావసానోత్సుక బాలవత్సా
విసృజ్యతాం ధేను రియం మహర్షేః. 2-45

(వసిష్ఠమహర్షియొక్క నందినీధేనువును అరణ్యములో సింహము పట్టుకొనగా దిలీపమహారాజు సింహముతో నిట్లనెను.)

ఓ మృగేంద్రా, నీ వీ గోవును విడిచి పెట్టి నాశరీరముచేతనే నీ యాహారవిధిని నిర్వర్తించుకొనుము. దీని వత్స(దూడ) సాయంకాలమున తల్లి రాకకై యుత్కంఠతో నెదురుచూచుచుండును. ఈ హోమధేనువును విడిచిపెట్టుము.

క్షతా త్కిల త్రాయత ఇత్యుదగ్రః
క్షత్రస్య శబ్దో భువనేషు రూఢః,
రాజ్యేన కిం తద్విపరీతవృత్తేః
ప్రాణై రుపక్రోశమలీమసై ర్వా. 2-53

సర్వ ప్రాణులను క్షతమునుండి (దెబ్బనుండి) రక్షించువాడు కావున క్షత్రియున కా పేరు లోకములో ప్రసిద్ధమై యున్నది. అట్లు రక్షింపజాలనివాడు నిందామలినములైన ప్రాణములను ధరించి యేమి ప్రయోజనము?

సేయం స్వదేహార్పణనిష్క్రియేణ
న్యాయ్యా మయా మోచయితుం భవత్తః,
న పారణా స్యాద్విహతా తవైవం
భవే దలుప్తశ్చ మునేః క్రియార్థః. 2-55

నా దేహమును నీ కర్పించుకొనుటయను ప్రతిఫలమును నీ కొసగి యీ గోవును నేను విడిపించుకొనుట న్యాయము. అట్లగుచో నీ కాహార లోపమును ఉండదు; వసిష్ఠునికి పయోఘృత హోమలోపమును ఉండదు.

తథేతి గాం ముక్తవతే దిలీపః
సద్యః ప్రతిష్టంభవిముక్త బాహుః,
సన్యస్త శస్త్రో హరయే స్వ దేహ
ముపానయ త్పిండమి వామిషస్య. 2-59

దిలీపుని ప్రార్థనమును సింహ మంగీకరించెను. అది వఱకు స్తంభించి యున్న దిలీపుని బాహు విపుడు విడినది. దిలీపుడు శస్త్రమును విడచి మాంసపుముద్ద నందించినట్లు తన దేహమును సింహమున కందించెను.

తస్మిన్ క్షణే పాలయితుః ప్రజానా
ముత్పశ్యత స్సింహనిపాత ముగ్రమ్,
అవాఙ్ముఖస్యోపరి పుష్పవృష్టిః
పపాత విద్యాధరహస్తముక్తా. 60

దిలీపుడు అధోముఖుడై సింహము తీవ్రముగా తనపై బడునని యూహించుచుండెను. ఇంతలో నాకాశమునుండి విద్యాధరులు జారవిడచిన పుష్పవర్ష మాయనపై బడెను.

---

## 3. గురుదక్షిణ

కౌత్సుడను బాలుడు వరతంతు మహర్షివద్ద పదునాల్గు విద్యలను నేర్చెను. దక్షిణను కోరవలసినదని యాతడు గురువును ప్రార్థించెను. కాని నిస్పృహుడైన యా మహర్షి "నా కేమియు వద్దు" అనెను. శిష్యుడు 'అట్లుకాదు, కోరుడు' అని నిర్బంధించెను. అందుల కా ఋషి కుపితుడై 'పదునాల్గు విద్యలకును పదునాల్గు కోట్ల బంగారు నాణెములను తెమ్ము' అనెను.

గురుదక్షిణకొఱకు స్నాతక బ్రహ్మచారి ధనమును యాచింపగా యథాశక్తిగానిచ్చి తీరవలయునను విధి ప్రతి గృహస్థునకును ఉండెను. ఈ మొత్తము పెద్దదగుటచే కౌత్సుడు రాజువద్దకే యేగి యాచింపదలచెను.

అప్పటికే రఘుమహారాజు తన సర్వధనమును యజ్ఞములో దానము చేసియుండెను. కావున అతిథిగా వచ్చిన కౌత్సునకు మట్టిప్రాతతో

నర్ఘ్యమిచ్చెను. అట్టిస్థితిలోనున్న రఘువును యాచించుట కౌత్సు నకు న్యాయముగా కన్పట్టలేదు. కాని యాతని యాగమనోద్దేశమును తెలిసి కొని రాజు ఆతనిని మరొక చోటునకు పోనీయక మంత్రపూతమైన యస్త్రమును ప్రయోగించి కుబేరుని వద్దనుండి ధనమును పొందదలచెను. ఇంతలో నాతని ధనాగారమున సువర్ణవర్షము కురిసెను.

అట్లు కురిసిన బంగారము తన గురువు చెప్పినదాని కంటె నెక్కువ యున్నందున దాని నంతను తీనికొనుట కా బ్రహ్మచారి నిరాకరించెను. ఋషి నుద్దేశించి తెచ్చిన ధనము తిరిగి తీసికొనుట యధర్మమని రాజు భావించెను. ప్రగాఢధార్మికతా బంధురమైన యీ కవితా ఘట్టములోని కొన్ని శ్లోకములుమాత్ర మిట నుదాహరింపబడుచున్నవి.

శరీరమాత్రేణ నరేంద్ర తిష్ఠ
న్నాభాసి తీర్థప్రతిపాదితర్ద్ధిః,
ఆరణ్యకోపాత్త ఫలప్రసూతిః
స్తంబేన నీవార ఇవావశిష్టః. (రఘువంశము 5-15)

"ఓ నరేంద్ర! సర్వస్వమును సత్పాత్రదత్తముచేసి శరీరమును మాత్రమే నిలబెట్టుకొనియున్నావు. అరణ్యవాసులు పంటను కోసికొని పోగా కేవలము మోడుగా నిలచియున్న నీవారధాన్యపు మొక్కవలె నీ విపు డున్నావు.

స్థానే భవా నేకనరాధిపస్స
న్నకించనత్వం మఖజం వ్యనక్తి,
పర్యాయపీతస్య సురైర్హిమాంశోః
కలాక్షయః శ్లాఘ్యతరో హి వృద్ధేః. 5-16

నీవు ఏకచ్ఛత్రాధిపత్యము గల్గియుండియు యజ్ఞము వలన అకించను డవైతివి. క్రమముగా దేవతలచేత త్రాగివేయబడిన యమృత శరీరముగల చంద్రుడు క్షీణించి యున్నను ఆ క్షయము ఆతని పరోప కారపరాయణ తకు నిదర్శన మైనందున కళావృద్ధి కంటెను ఎక్కుడు శ్లాఘా పాత్రమై యుండును. నీ ధనక్షయముకూడ నట్లే యున్నది.

త దన్యత స్తావ దనన్యకార్యో
గుర్వర్థ మాహర్తు మహం యతిష్యే,

ప్రష్ట్యస్తు తే విర్గలితాంబుగర్భం
శరద్ఘనం వార్దతి చాతకోఽ పి. 5-17

ఓ రాజా! నే నిపుడు మరొక దాతవద్ద కేగెదను(వర్షా కాలములో) లోపలి నీటి నంతను ఓడ్చివైచిన శరత్కాల మేఘమును చాతకపక్షికూడ యాచింపదు కదా! నీకు శుభ మగుగాక!

గుర్వర్థ మర్థీ శ్రుతపారదృశ్వా
రఘో ప్సకాశా దనవాప్య కామమ్,
గతో వదాన్యాంతర మిత్యయం మే
మా భూ త్పరీవాద నవావతారః 5-24

అంత రఘు విట్లు పలికెను "శాస్త్రపారంగతుడైన స్నాతక బ్రహ్మచారి గురుదక్షిణకొఱకు రఘువును యాచించి, యట తన కోరికను బొందజా లనివాడై మరొక దాతవద్ద కేగెనను అప్రతిష్ఠ నాకు కలుగకుండు గాక!" ఇట్టి యపవాదము నా కిదివఱ కెన్నడును లేదు.

ప త్వం ప్రశస్తే మహితే మదీయే
వసన్ చతుర్థోఽగ్ని రివాగ్న్యగారే,
ద్విత్రాణ్యహా న్యర్హసి సోఢు మర్హన్
యావ ద్యతే సాధయితుం త్వదర్థమ్. 5-25

ఓ మాన్యుడ! ఆహవనీయము, గార్హపత్యము, దక్షిణాగ్ని యను మూడ గ్నులను గల్గియున్న పవిత్రమైన నా యగ్నిహోత్ర గృహములో నాల్గవ యగ్నివలె నీవు రెండు మూడు దినములుండుము. ఇంతలో నీ కార్యమును సాధించుటకు నేను ప్రయత్నించెదను.

ప్రాతః ప్రయాణాభిముఖాయ తస్మై
సవిస్మయాః కోశగృహే నియుక్తాః,
హిరణ్మయీం కోశగృహస్య మధ్యే
వృష్టిం శశంసుః పతితాం నభస్తః. 5-29

ఆ రఘుమహారాజు ధనాగారముయొక్క మధ్యభాగములో ప్రాతఃకా లమున సువర్ణవర్షము కురిసెను. కుబేరునిపై దండయాత్ర కేగనున్న యాతని కావార్త తెలుపబడెను.

జనస్య సాకేతనివాసిన స్తౌ
ద్వా వ ప్యభూతా మభినంద్యసత్త్వౌ,
గురుప్రదేయాధిక నిస్పృహోఽర్థీ
నృపోఽర్థికామా దధిక ప్రదశ్చ. 5-31

గురువుకోరిన ధనముకంటె నా ధనము హెచ్చుగా నున్నందున నా హెచ్చు భాగమును తీసికొనుటకు ముని కుమారు డిష్టపడలేదు. ఆతడు కోరినదానికంటె హెచ్చు ధనమును రాజు బలవంతముగా నిచ్చెను. ఈ యిద్దరి ధర్మాభినివేశమును సాకేత పురవాసు లభినందించిరి.

---

## 4. ప్రకీర్ణము

శశినా సహ యాతి కౌముదీ
సహ మేఘేన తటి త్ప్రలీయతే,
ప్రమాదాః పతివర్త్మగా ఇతి
ప్రతిపన్నం హి విచేతనై రపి. (కుమారసంభవము 4-33)

పతి మరణమునకు దుఃఖించుచున్న రతీదేవి సహగమన ధర్మమును ప్రశంసించుచున్నది.

"చంద్రునితో బాటు వెన్నెలయు పోవుచున్నది. మేఘముపోయిన పిమ్మట మెఱుపుతీగ కన్పట్టదు. స్త్రీలకు భర్తతో సహగమనము కర్తవ్యమని యీ రీతిగా నచేతనములు కూడ నంగీకరించుచున్నవి."

కుముదాన్యేవ శశాంకః
సవితా బోధయతి పంకజా న్యేవ,
వశినాం హి పరపరిగ్రహ
సంశ్లేషరాఙ్ముఖీ వృత్తిః. (శాకుంతలము 5-29)

చంద్రుడు కలువలను మాత్రమే మేల్కొలుపును. సూర్యుడు పద్మములను మాత్రమే మేల్కొలుపును. అట్లే యింద్రియ నిగ్రహము గలవారు స్వకళత్రములపట్లనే సుముఖులుగానుండి పరస్త్రీలపట్ల విముఖులుగా నుండెదరు.

భవన్తి నమ్రా స్తరవః ఫలోద్గమై
ర్నవాంబుభి ర్దూరవిలంబినో ఘనాః,
అనుద్ధతా స్సత్పురుషా స్సమృద్ధిభిః
స్వభావ ఏవైష పరోపకారిణామ్. 5-13

ఫలము లెక్కువగా బయలు దేరుటవలన చెట్లువంగును. నీటి నెక్కువగా గల్గియున్న మేఘములు విశేషముగా క్రిందికి వంగియుండును. సత్పురుషు లైశ్వర్యము కల్గిన కొలదియు వినయము గల్గియుందురు. పరోపకారుల కిది స్వభావముగదా!

న ఖలు న ఖలు బాణః సన్నిపాత్యోఽయ మస్మిన్
మృదుని మృగశరీరే పుష్పరాశా వివాగ్నిః,
క్వ బత! హరిణకానాం జీవితం చాతిలోలం
క్వ చ నిశితనిపాతా స్సారపుంఖా శ్శరాస్తే. 1-5

ఋషికుమారులు దుష్యంతునితో "ఓ రాజా! మృదువైన యీ లేడి శరీరముమీద బాణము వేయరాదు. పుష్పరాశిలో చిచ్చు పెట్టదగునా? మిక్కిలి సున్నితమైన లేళ్ళ జీవిత మెక్కడ? మిక్కిలివాడియైన నీ బాణము లెక్కడ?" అందురు.

పాతుం న ప్రథమం వ్యవస్యతి జలం యుష్మా స్వపీతేషు యా,
నాదత్తే ప్రియమండనాని భవతాం స్నేహేన యా పల్లవమ్,
ఆద్యే వః కుసుమప్రసూతి సమయే యస్యా భవ త్యుత్సవః,
సేయం యాతి శకుంతలా పతిగృహం సర్వై రనుజ్ఞాయతామ్. 4-8

శకున్తల యత్తవారింటి కేగునపుడు కణ్వమహాముని వృక్షములను లత లను ఉద్దేశించి యిట్లు చెప్పను.

ఓ వనస్పతులారా! మీకు నీరుపోయకుండ శకుంతల యెన్నడును గ్రుక్కెడు మంచినీటిని త్రాగుట కిచ్చగింపలేదు. ఆభరణములన్న నామెకు ప్రీతియేయైనను మీ చిగుళ్ళను త్రుంచుట కామె ప్రాణ మొప్పకుండెను. మీరు తొలిసారిగా పువ్వు తొడిగినప్పు డామె కుత్సవము గల్గుచుండెను. అట్టి శకుంతల యిపుడు పతిగృహమున కేగుచున్నది. మీరందరు నను మతి నొసంగుడు.

శుశ్రూషస్వ గురూ న్కురు ప్రియసఖీవృత్తం సపత్నీజనే
పత్యు ర్విప్రకృతాపి రోషణతయా మా స్మ ప్రతీపం గమః,
భూయిష్ఠం భవ దక్షిణా పరిజనాభాగ్యే ష్వనుత్సేకినీ
యాన్త్యేవం గృహిణీపదం యువతయో వామాః కులస్యాధయః. 4-17

భర్తృగృహమున కేగునపుడు శకుంతలకు కణ్వుని యుపదేశము:-

"పెద్దల శుశ్రూష మానకుము. సవతులను స్నేహితురాండ్రవలె చూచుచుండుము. భర్తకోపపడినను కోపముతో ఎదురు తిరుగవద్దు. సేవక జను లందరిపట్లను పక్షపాతము లేకుండ విశేషముగా దయను జెలుపు చుండుము. ఐశ్వర్యములో మునిగియున్నను గర్వింపకుము. ఈ విధముగా సంచరించు యువతులు సద్గృహిణులుగా విఖ్యాత లగుదురు. ఇందులకు విరుద్ధముగా సంచరించువారలు కులగౌరవమును చెడగొట్టుదురు."

భాను స్సకృద్యుక్త తురంగ ఏవ
రాత్రిందివం గంధవహః ప్రయాతి,
శేష స్సదై వాహితభూమిభారః
షష్ఠాంశ వృత్తే రపి ధర్మ ఏషః. 5-5

సూర్యు డేనాడో యొకేసారి తన రథమునకు గుఱ్ఱములను పూన్చి నాడు. నాటినుండి విశ్రాంతి లేకుండ లోకోపకార నిమిత్తము తిరుగుచునే యున్నాడు. వాయువు రాత్రియు బవలును వీచుచునే యున్నాడు. విశ్రాంతి జెఱుగడు. ఆదిశేషు డొక్కసారికూడ క్రిందకు దింపకుండ భూమిని మోయు చునే యున్నాడు. భూపాలుడు కూడ నిట్లే సర్వకాల సర్వావస్థల యందును లోకక్షేమమునకు పాటుపడుట ధర్మము.

స్వసుఖనిరభిలాషః ఖిద్యసే లోకహేతోః
ప్రతిదిన మథవా తే వృత్తి రేవంవిధైవ,
అనుభవతి హి మూర్ధ్నా పాదపస్తీవ్ర ముష్ణం
శమయతి పరితాపం ఛాయయా సంశ్రితానామ్. 5-18

ఓ రాజా! నీ సుఖమును నీవు కోరుటలేదు. లోకము నిమిత్తమై బాధప డుచున్నావు. ఇప్పుడే యననేల? ప్రతి దినము నీ ప్రవృత్తి యిట్లేయున్నది. వృక్షము ఎండనంతను తాను నెత్తిపై భరించి తన్నాశ్రయించుకొన్న వారికి నీడ నొసగి పరితాపము నుపశమింప చేయుచున్నది గదా!

యాత్యేకతోఽ స్తశిఖరం పతి రోషధీనా
మావిష్కృతారుణపురస్సర ఏకతోఽర్కః,
తేజోద్వయస్య యుగప ద్వ్యసనోదయాభ్యాం
లోకో నియమ్యత ఇవాత్మదశాంతరేషు. 4-1

సూర్యోదయ వర్ణనము:- ఒక వైపున చంద్రుడు అస్తగిరిని చేరుచున్నాడు. మరియొకతట్టు సారథియైన యరుణుని ముందుంచుకొని సూర్యుడుద యించు చున్నాడు. ఇట్లు తేజశ్శాలురైన సూర్య చంద్రు లిద్దరిలో నొకరు అస్తమించుటయు, మరొక రుదయించుటయు చూడగా మానవులకు తమ తమ భాగ్యము లెంతలో మారిపోగలవో, తెల్ల మగుచున్నది.

అప్యన్యస్మి ఞ్జలధర మహాకాల మాసాద్య కాలే
స్థాతవ్యం తే నయనవిషయం యావ దత్యేతి భానుః,
కుర్వన్ సంధ్యాబలిపటహతాం శూలినః శ్లాఘనీయా
మామంద్రాణాం ఫల మవికలం లప్స్యసే గర్జితానామ్.

మేఘసందేశం (1-33)

మేఘసందేశమువంటి శృంగార గ్రంథములోకూడ పరమేశ్వరభక్తి యిమ డ్చబడిన తెఱంగు: యక్షుడు మేఘునితో నిట్లనును.

"ఓ మేఘుడ! నీ వుజ్జయినీ పట్టణమున కేగునప్పటికి సాయంకాలము కాకపోయినను సూర్యాస్తమయపర్యంతము నచ్చట నాగవలయును. ఆ మహాకాళక్షేత్రమున సాయంకాలము శివునకు ఆరాధనము జరుగును. ఆ సమయమున పటహమును వాయించువానికి గొప్ప పుణ్యఫలము గల్గును. నీవు బిగ్గఱగా నుఱుముటవలన శివుని యారాధనములో పాల్గొన్నవాడ వగు దువు. అందులకు మహాఫలమును పొందగలవు.

హిత్వా తస్మిన్ భుజగవలయం శంభునా దత్తహస్తా
క్రీడాశైలే యది చ విచరే త్పాదచారేణ గౌరీ,
భంగీభక్త్యా విరచితవపుః స్తంభితాఽన్తర్జలౌఘః
సోపానత్వం కురు మణితటారోహణా యాగ్రయాయీ.

మేఘసందేశం (1-64)

కైలాసపర్వతముమీద పార్వతీదేవి శివునితో విహరించుచుండును. శివు డామెకు చేయూత నొసగును. అతని చేతులపైనుండు పాములవలన నామె

భయపడకుండుటకై భుజగవలయము నాతడు తీసి వైచును. ఎగుడుదిగుడుగానుండు మణితటము నారోహించుటలో నామెకు శ్రమ కలుగకుండుటకై నీవు నీ శరీరమును మెట్లరూపముగా నమర్చి నీ లోని జలమును పైకి రానీయకుండ స్తంభింపచేసి యామె నడచుటకై సోపాన మార్గమును నిర్మించుము. నీవు కామరూపుడ వగుటచే నట్లు సోపానరూపమును ధరింపగలవు.

* * *

# భర్తృహరి

మనసి వచసి కాయే పుణ్యపీయూషపూర్ణా
స్త్రిభువన ముపకారశ్రేణిభిః ప్రీణయన్తః,
పరగుణ పరమాణూన్ పర్వతీకృత్య నిత్యం
నిజహృది వికసన్త స్సన్తి సన్తః కియన్తః.

నీతిశతకము-పరోపకారపద్ధతి-10

మనస్సులోను, వాక్కులోను శరీరములోను అమృత ప్రపూర్ణులైన మహానుభావు లీ లోకమున కొలదిమందియే యుందురు. వారి శరీర మమృతముతోనిండినది. కనుకనే ముల్లోకములకు నుపకారకములైన పనులను వారు చేయుచుందురు. ఎదుటి వానిలో నలకంత మంచియున్నచో వారు దానిని పర్వతమంత గొప్పదిగా వర్ణించుచుందురు. వారి వాక్కు అమృతమయమనుట కిది నిదర్శనము. వారు మనస్సులో నే వ్యాకులతకు కాని యీర్ష్యాసూయాదులకు కాని చోటీయక నిరంతరము సంతుష్టాంతరంగులై యుందురు. వారి మన స్సమృతమయ మనుట కిది నిదర్శనము.

క్షాంతిశ్చేత్కవచేన కిం కి మరిభిః క్రోధోఽస్తిచే ద్దేహినాం
జ్ఞాతిశ్చే దనలేన కిం యది సుహృద్దివ్యౌషధైః కిం ఫలమ్,
కిం సర్పైర్యది దుర్జనాః కిము ధనైర్విద్యాఽనవద్యా యది
వ్రీడాచేత్కిము భూషణైస్సుకవితా యద్యస్తిరాజ్యేన కిమ్.

నీతిశతకము-విద్వత్పద్ధతి-17

ఓర్పున్నచో కవచ మేల? కోపమున్నచో వేరుగా శత్రువు లేల? జ్ఞాతి యుండగా అగ్ని యెందులకు? మంచి స్నేహితు డుండగా ఔషధములతో నేమి ప్రయోజనము? దుర్జను లుండగా సర్పము లెందులకు? స్వచ్ఛమైన విద్య యుండగా ధనమెందులకు? కవిత్వ మున్నచో రాజ్యపరిపాల నాధికార మెందులకు?

జాడ్యం ధియో హరతి సించతి వాచి సత్యం
మానోన్నతిం దిశతి పాప మపాకరోతి,
చేతః ప్రసాదయతి దిక్షు తనోతి కీర్తిం
సత్సంగతిః కథయ కిం న కరోతి పుంసామ్.

నీతి-విద్వత్పద్ధతి-19

పురుషులకు సత్సహవాసము ఏ యుపకారమును చేయదు? అది మాంద్యమును పోగొట్టును, వాక్కునందు సత్యసంధతను చేకూర్చును; ఆత్మ గౌరవమును పెంచును; పాపమును పోగొట్టును; మనస్సును నిర్మలముగా నుంచును; దిక్కులయందు కీర్తిని వ్యాపింపచేయును.

దౌర్మంత్ర్యా న్నృపతిర్వినశ్యతి యతి స్సంగాత్సుతో లాలనా
ద్విప్రోఽనధ్యయనా త్కులం కుతనయా చ్ఛీలం ఖలోపాసనాత్,
హ్రీర్మద్యా దనవేక్షణాదపి కృషిః స్నేహః ప్రవాసాశ్రయా
న్మైత్రీ చాప్రణయా త్సమృద్ధి రనయా త్త్యాగా త్ప్రమాదా ద్ధనమ్.

నీతి-అర్థపద్ధతి-32



చెడ్డ మంత్రిని గల్గియుండుటచే రాజు నశించును; సాంగత్యమువలన సన్యాసి భ్రష్టుడగును; లాలన చేయుటవలన కుమారుడు చెడిపోవును; వేదాధ్యయనమును మానుటవలన బ్రాహ్మణుడు చెడును. చెడ్డకుమారునివలన కులము పాడగును. దుర్మార్గులను సేవించుటవలన శీలము చెడిపోవును. మద్యపానమువలన సిగ్గు జారిపోవును. సరిగాచూచు కొనక పోవుటవలన వ్యవసాయము చెడిపోవును; ఇతరప్రదేశమునకు వెళ్ళుటవలన స్నేహము తగ్గిపోవును; ప్రీతిని కన్పఱుపకపోవుటవలన మైత్రి చెడును; త్యాగమువలనను ఏమరుపాటువలనను ధనము హ్రస్వమగును.



యద్ధాత్రా నిజఫాలపట్టలిఖితం స్తోకం మహద్వా ధనం
తత్ప్రాప్నోతి మరుస్థలేఽపి నితరాం మేరౌ చ నాఽతోఽధికమ్,
తద్ధీరో భవ విత్తవత్సు కృపణాం వృత్తిం వృథా మా కృథాః
కూపే పశ్య పయోనిధావపి ఘటో గృహ్ణాతి తుల్యం జలమ్.

నీతి-అర్థపద్ధతి-40

మానవున కెంత ధనమువచ్చునని లలాటముమీద బ్రహ్మచే వ్రాయబడియున్నదో యంత ధనము వాడెక్కడి కేగినను వచ్చితీరును; ఎడారి కేగినను అంతకంటె తక్కువ రాదు. మేరు పర్వతముమీది కేగినను అంతకంటె హెచ్చురాదు. కుండ బావిలో ముంచబడినప్పు డెంత నీటిని గ్రహించునో సముద్రములో ముంచబడినప్పుడుకూడ నంతియే నీటిని గ్రహింపగల్గునుగదా! కావున ధనవంతులయెడల దైన్యమును కన్పఱుపకుము. రావలసియున్నది వచ్చియే తీరును.

అకరుణత్వ మకారణ విగ్రహః
పరధనే పరయోషితి చ స్పృహా,
సుజన బంధుజనే ష్వసహిష్ణుతా
ప్రకృతిసిద్ధ మిదం హి దురాత్మనామ్. నీతి-దుర్జనపద్ధతి-41

జాలిలేకుండుట, అకారణ విరోధము, పరకాంతా కనకముల యందా సక్తి, మంచివారిని బంధువులను చూచి యీర్ష్యపడుట ఇవి దురాత్ములకు సహజలక్షణములు.

జాడ్యం హ్రీమతి గణ్యతే వ్రతశుచౌ దంభశ్శుచౌ కైతవం
శూరే నిర్ఘృణతా మునౌ విమతితా దైన్యం ప్రియాలాపిని,
తేజస్వి న్యవలిప్తతా ముఖరతా వక్తవ్యశక్తిఃస్థిరే
తత్కో నామ భవేత్సగుణినాం యో దుర్జనైర్నాంకితః.
నీతి-దుర్జనపద్ధతి-43

దుర్జనులు సజ్జనులయందుండు మంచిగుణముల నన్నింటిని చెడ్డ గుణములనుగా పరిగణింతురు. లజ్జను మందకొడితన మందురు. శుభ్రమైన వ్రతానుష్ఠానమును డంబమందురు. శుచిగా నుండుటను నటనమందురు; శౌర్యమును క్రూరత్వ మందురు. మౌనమును విపరీతబుద్ధి యందురు. ప్రియముగా మాట్లాడుటను దైన్యమందురు. తేజశ్శాలిత్వమును పొగరుబోతుతనమందురు. వక్తృత్వమును వదరుబోతుతన మందురు. వారు చెడ్డగా నెంచని సుగుణ మెద్దియు లేదు.

లోభశ్చే దగుణేన కిం పిశునతా యద్యస్తికిం పాతకైః
సత్యం చేత్తపసా చ కిం శుచిమనో యద్యస్తి తీర్థేన కిమ్,
సౌజన్యం యది కిం బలేన మహిమా యద్యస్తి కిం మండనైః
సద్విద్యా యది కిం ధనైరపయశో యద్యస్తి కిం మృత్యునా.
నీతి-దుర్జనపద్ధతి-44

లోభమున్నచో వేరుగా చెడ్డగుణ మక్కఱలేదు. కొండెములు చెప్పు లక్షణమున్నచో వేరుగా పాపములను చేయనక్కరలేదు; సత్యవ్రతమున్నచో తపస్సు లేల? పరిశుద్ధమైన మనసున్నచో తీర్థయాత్ర లేల? మంచితనమున్నచో బల మెందులకు? మహిమయున్నచో నలంకారము లెందులకు?

మంచివిద్య యున్నచో ధన మెందులకు? అపకీర్తి యున్నచో మరణ మెందులకు?

విపది ధైర్య మథాఽభ్యుదయే క్షమా
సదసి వాక్పటుతా యుధి విక్రమః,
యశసి చాభిరతి ర్వ్యసనం శ్రుతౌ
ప్రకృతిసిద్ధ మిదం హి మహాత్మనామ్. నీతి-సుజనపద్ధతి-52

ఆపత్కాలములో ధైర్యము, సంపత్సమయములో నోర్పు, సభలో వాక్పటుత్వము, యుద్ధములో పరాక్రమము, కీర్తియందు రక్తి. వేదమందు మిక్కుటమగు నాసక్తి - ఇవి మహాత్ములకు సహజలక్షణములు.

సంపత్సు మహతాం చిత్తం
భవే దుత్పల కోమలమ్,
ఆపత్సు చ మహాశైల
శిలాసంఘాత కర్కశమ్. నీతి-సుజనపద్ధతి-55

సంపత్కాలములో మహాత్ముల చిత్తములు పద్మకోమలములుగానుండును. అనగా: ఇతరులకష్టములను చూచి వారు కరుణతో ద్రవించి సాహాయ్యము చేయుదురు. ఆపత్కాలములో మహాత్ముల మనస్సులు శిలాకఠినములై యుండును. అనగా, ఓర్పుతో తమ కష్టాలను భరించుకొను శక్తి వారికుండును.

పద్మాకరం దినకరో వికచం కరోతి
చంద్రో వికాసయతి కైరవ చక్రవాళమ్,
నాభ్యర్థితో జలధరోఽ పి జలం దదాతి
సంతః స్వయం పరహితే విహితాభియోగాః. నీతి-పరోపకారపద్ధతి-63

సత్పురుషులు ఇతరులు కోరకుండగనే పరహితము నాచరించుచుందురు. సూర్యుడు తనకు తానే సరస్సులోని పద్మములను వికసింపచేయును. అట్లే చంద్రుడు కలువలను వికసింపచేయును. ఎవరును కోరకుండగనే మేఘుడు లోకమునకు జలము నిచ్చును.

ఏతే సత్పురుషాః పరార్థఘటకాః స్వార్థాన్ పరిత్యజ్య యే
సామాన్యాస్తు పరార్థ ముద్యమభృతః స్వార్థాఽ విరోధేన యే,

తేఽమీ మానుషరాక్షసాః పరహితం స్వార్థాయ నిఘ్నంతి యే
యే తు ఘ్నంతి నిరర్థకం పరహితం తే కే న జానీమహే.

నీతి-పరోపకారపద్ధతి-64

స్వార్థమును విడచి పరార్థమును నెఱవేర్చువారు సత్పురుషులు. తమ కార్యమునకు భంగము లేకుందున ట్లితరుల కార్యములను నెరవేర్చు వారు సామాన్యులు. తమ కార్యము కొఱకై యితరుల కార్యములను చెడగొట్టు వారు రాక్షసులు. ఊరకయే యితరుల కార్యములను చెడగొట్టు వారి నేమన వలయునో తెలియకున్నది.

యః ప్రీణయే త్సుచరితైః పితరం స పుత్రో
యద్భర్తు రేవ హిత మిచ్ఛతి తత్కళత్రమ్,
తన్మిత్ర మాపది సుఖే చ సమక్రియం య
దేతత్త్రయం జగతి పుణ్యకృతో లభన్తే.

నీతి-సుజన 59

తన సత్ప్రవర్తనముచే నెవడు తండ్రిని సంతోషపెట్టునో వాడే సత్పుత్రుడు. ఏ స్త్రీ భర్తృహితమునే నిరంతరము కోరునో యామెయే సత్కళత్రము. ఆపత్కాలమునను సుఖసమయమునను ఎవ డొకే విధముగా నుండునో వాడే మంచి మిత్రుడు. ఈ ముగ్గురును పుణ్యాత్ములకే లభింతురు.

నిందంతు నీతినిపుణా యది వా స్తువన్తు
లక్ష్మీ స్సమావిశతు గచ్ఛతు వా యథేష్టమ్,
అద్యైవ వా మరణ మస్తు యుగాంతరే వా
న్యాయ్యా త్పథః ప్రవిచలంతి పదం న ధీరాః.

నీతి-ధైర్యపద్ధతి-74

లౌకిక నీతివిశారదులు నిందింతురుగాక లేక స్తుతింతురుగాక. ఐశ్వర్యము వచ్చుగాక లేక పోవుగాక. మరణ మిప్పుడే సంభవించుగాక లేక మరొకయుగము వరకును రాకుండు గాక. ధీరులైన వా రెట్టి పరిస్థితుల లోను న్యాయమార్గమునుండి యొక అడుగైనను తప్పరు.

ఛిన్నోఽపి రోహతి తరుః
క్షీణోఽ ప్యుపచీయతే పున శ్చంద్రః,
ఇతి విమృశంత స్సంతః
సంతప్యంతే న విప్లథేషు లోకేషు.

నీతి-ధైర్యపద్ధతి-79

కొట్టివేసినను చెట్టు తిరిగి చిగుర్చును. చంద్రుడు క్షీణించి పోయినను తిరిగి పూడుకొనును. ఈ సంగతులను చక్కగా విమర్శించి తెలిసికొన్న సత్పురుషులు కష్టకాలములలో పరితాపమును పొందరు.

ఐశ్వర్యస్య విభూషణం సుజనతా శౌర్యస్య వాక్సంయమః
జ్ఞాన స్యోపశమః శ్రుతస్య వినయో విత్తస్య పాత్రే వ్యయః,
అక్రోధ స్తపసః క్షమా ప్రభవితు ర్ధర్మస్య నిర్వ్యాజతా
సర్వేషామపి సర్వకారణ మిదం శీలం పరం భూషణమ్.
నీతి-ధైర్యపద్ధతి-80

ఐశ్వర్యమునకు అలంకారము మంచితనము. పరాక్రమమునకు అలంకారము వాఙ్నియమము. జ్ఞానమున కలంకారము శాంతి. శాస్త్ర పాండిత్యమున కలంకారము వినయము. ధనమున కలంకారము సత్పాత్ర వినియోగము. అన్నిటికిని కారణమైన మంచిశీలము ఎల్లరకు గొప్ప భూషణము.

యథా కందుకః పాతేనోత్పత త్యార్యః పతన్న పి,
తథా త్వనార్యః పతతి మృత్పిండ పతనం యథా. నీతి-దైవపద్ధతి-83

బంతి క్రిందపడి తిరిగిపైకి లేచునట్లు మంచివాడు ఒకసారి క్రింద పడినను తిరిగి పైకి లేచును. దుష్టుడు మట్టి ముద్దవలె ఒకసారి క్రిందపడిన నింక పైకి లేవజాలడు.

గజ భుజంగవిహంగమ బంధనం
శశిదివాకరయో ర్గ్రహపీడనమ్,
మతిమతాం చ విలోక్య దరిద్రతాం
విధి రహో బలవా నితి మే మతిః. నీతి-దైవపద్ధతి -85

స్వేచ్ఛగా తిరుగు ఏనుగులు, పాములు పక్షులు ఒక్కొక్కప్పుడు బంధములో చిక్కుకొనును. సూర్యచంద్రు లంతటి వారికి కూడ రాహు కేతువుల వలన గ్రహణము గల్గును. బుద్ధిమంతులకుకూడ దారిద్ర్యము గలుగు చుండును. వీనిని చూడగా దైవమెంత బలవత్తరమైనదో నాకు తెలియుచున్నది.

నమస్యామో దేవా న్నను హతవిధే స్తేఽపి వశగా
విధి ర్వంద్య స్సోఽపి ప్రతినియత కర్మైకఫలదః,
ఫలం కర్మాయత్తం కిమమరగణైః కిం చ విధినా
నమ స్తత్కర్మభ్యో విధి రపి న యేభ్యః ప్రభవతి. నీతి-కర్మపద్ధతి-91

దేవతలు గొప్పవారు కదా యని నమస్కరించు చున్నాము. కాని వారు మాత్రము విధికి వశులైపోవుట లేదా? ఆ విధి సమస్కరింప దగినవాడే యైనను స్వతంత్రుడు కాడు. కర్మ ఫలము నొసగుటకు మాత్రమే యాతడు సమర్థుడు. ఫలము కూడ కర్మకు అధీనమై యున్నది. కర్మ నాచరింపనిచో నెవరికిని ఫలము రాదు. కావున నా కర్మలకే నమస్కారము చేయువలసి యున్నది. విధికంటెను అవియే యెక్కువ సామర్థ్యము గలవి.

స్థాల్యాం వైడూర్యమయ్యాం పచతి తిలఖలం చాందనై రింధనౌఘైః
సౌవర్ణైర్లాంగలాగ్రై ర్విలిఖతి వసుధా మర్కతూలస్య హేతోః
ఛిత్వాకర్పూరఖండాన్ వృతిమిహ కురుతే కోద్రవాణాం సమంతాత్,
ప్రాప్యేమాం కర్మభూమిం న భజతి మనుజో యస్తపోమందభాగ్యః.
నీతి-కర్మపద్ధతి-96

కర్మ భూమియైన యీ భరత ఖండములలో పుట్టి తపస్సు చేయనివాడీ జన్మమును వ్యర్థ మొనరించు కొనుచున్నాడు. తపస్సు నాచరింపని వాని కిక్కడ జన్మ మెందులకు? తెలక పిండిని వండుటకు వైడూర్య పాత్ర మెందులకు? మంచి గంధపు కట్టెల మంట యెందులకు? జిల్లేళ్ళను మొలపించుటకు బంగరు నాగళ్లతో భూమిని దున్ననేల? ఆళ్ళను కాపాడుటకు కర్పూరపు కంచె యెందులకు? తపోరహిత జీవితముగడపుట కీ భరతఖండమే జన్మభూమి కానక్కఱలేదు.

వనే రణే శత్రు జలాగ్ని మధ్యే
మహార్ణవే పర్వత మస్తకే వా,
సుప్తం ప్రమత్తం విషమస్థితం వా
రక్షంతి పుణ్యాని పురాకృతాని. నీతి-కర్మపద్ధతి -99

అరణ్యమందును, యుద్ధములోను, శత్రుమధ్యమునను, జలములోను, పర్వతాగ్రమునను, నిద్రపోవునపుడును, ఒడలు తెలియని స్థితిలోను విషమ పరిస్థితిలోను కేవలము పూర్వపుణ్యములే రక్షింపవలయును.

ఆశా నామ నదీ మనోరథజలా తృష్ణాతరంగాఽకులా
రాగగ్రాహవతీ వితర్కవిహగా ధైర్యద్రుమధ్వంసినీ,
మోహావర్త సుదుస్తరాఽఽ తిగహనా ప్రోత్తుంగ చింతాతటీ
తస్యాః పారగతా విశుద్ధమనసో నందంతి యోగీశ్వరాః.
వైరాగ్య-తృష్ణాదూషణము-10

ఆశ యనునది యొక నది, ఆ నదికి కోరికలే జలము. ఆసక్తియే తరంగజాలము; ఆ యా వస్తువుల పైనను వ్యక్తుల పైనను గల్గు రాగములే యందలి మొసళ్ళు, వితర్కములే యందలి పక్షులు. ఈ నదీ ప్రవాహ వేగము ధైర్యమను తటరుహములను కూల్చి వైచును. అది మోహము లనెడు సుడిగుండములు కలది, దాట శక్యము కానిది. మిక్కిలి లోతైనది. ఉన్నతమైన విచారము లనెడు గట్లు గలది. చిత్త శుద్ధిగల్గిన యోగీశ్వరులు ఈ నదిని దాటి దోషముల నావిష్కరించు చున్నారు.

గంగాతరంగ హిమశీకర శీతలాని
విద్యాధరాధ్యుషిత చారుశిలాతలాని,
స్థానాని కిం హిమవతః ప్రళయం గతాని
య త్సావమాన పరపీడరతా మనుష్యాః వైరాగ్య-యాచ్ఞాదైన్య-24

ధనహీనులైన మానవులు ధనవంతు లవమానపురస్సరముగా నిచ్చెడు ఆహారమును భుజించుచు నిట బ్రదుకనేల? కందమూల ఫలాదులను గల్గి గంగోదక శీకరశీతలము లయినట్టియు, విద్యాధరులచే నధివసింపబడి రమ్య శిలాతలములను గల్గిన హిమాలయ పర్వతప్రదేశము లేమయి పోయినవి?

వ్యాఘ్రీవ తిష్ఠతి జరా పరితర్జయన్తీ
రోగాశ్చ శత్రవ ఇవ ప్రహరన్తి దేహమ్,
ఆయుః పరిస్రవతి భిన్నఘటా దివాంభో
లోక స్తథాఽ ప్యహిత మాచరతీతి చిత్రమ్.

వైరాగ్య-భోగాస్థైర్య-38

వార్ధకము పెద్దపులివలె మీద పడనున్నది. రోగములు శత్రువులవలె దేహము మీద దెబ్బలు తీయుచున్నవి. చిల్లుకుండనుండి నీరు స్రవించు నట్లు ఆయువు క్రమముగా జారిపోవుచున్నది. అట్లయినను మానవులు దుఃఖఫలములను తెచ్చి పెట్టు పాపముల నాచరించు చున్నారు కదా!

ఆయుర్వర్షశతం నృణాం పరిమితం రాత్రౌ తదర్ధం గతం
తస్యార్ధస్య పరస్య చార్ధమపరం బాలత్వ వృద్ధత్వయోః,
శేషం వ్యాధివియోగ దుఃఖసహితం సేవాదిభి ర్నీయతే
జీవే వారితరంగ చంచలతరే సౌఖ్యం కుతః ప్రాణినామ్?
వైరాగ్య-కాలమహిమ-49

మనుష్యుల యాయువు నూరు సంవత్సరములు. అందు సగము కాలము రాత్రులలో గడచిపోవును. మిగిలిన సగములో సగము బాల్య, వృద్ధత్వములలో గడచిపోవును. ఆ మిగిలిన కాలముకూడ రోగములలోను, ఇష్టజన వియోగములోను, పరులకు దాస్యముచేయుటలోను గడచిపోవును. నీటికెరటమువలె క్షణభంగురమయిన యీ జీవితములో మనుష్యులకు సుఖ మెక్కడనున్నది?

నృపతితో యతీశ్వరు డిట్లనుచున్నాడు:- 1

త్వం రాజా వయ మప్యుపాసిత
గురు ప్రజ్ఞాభిమానోన్నతాః
ఖ్యాతస్త్వం విభవైర్యశాంసి కవయో
దిక్షు ప్రతన్వంతి నః,
ఇత్థం మాన ధనాతిదూర ముభయో
రప్యావయో రంతరం
యద్యస్మాసు పరాఙ్ముఖోఽపి
వయ మప్యేకాంతతో విస్పృహాః. వైరాగ్య-యతినృపతి-51

నీవు భూపాలుడవు. మేము విరాగులము; గురుకృపచే గలిగిన జ్ఞానమునం దభిమానముగలవారము. నీ యైశ్వర్యమునుబట్టి నీవు ప్రసిద్ధుడవైతివి. మా మహిమ నెఱిగి యున్న కవీశ్వరులు మమ్ము వర్ణించి నలుదిక్కుల మా కీర్తిని వ్యాపింపజేసినారు. ఇట్లు మన యిరువురకు నొక విధముగా భేదమున్నను మరొకవిధముగా భేదము లేదు. నీవు ధనైకధనుడవు. మేము మానధనులము. నీవు మాపట్ల నిరాదరణము చూపుదువేని మేమును ని న్నుపేక్షింపగలము. 51

అర్థానా మీశిషే త్వం వయమపి చ
గిరా మీశ్మహే యావదర్థం
శూరస్త్వం వాదిదర్పవ్యుపశమన విధా
వక్షయం పాటవం నః,
సేవంతే త్వాం ధనాఢ్యా మతిమల
హతయే మా మపి శ్రోతుకామా
మయ్య ప్యాస్థా వ తే చేత్త్వయి మమ
సుతరా మేష రాజన్ గతో ఽస్మి. వైరాగ్య-యతినృపతి-52

నీవు ధనమున కధిపతివి. మేము విద్యల కధిపతులము. నీవు శత్రువుల నణచు శూరుడవు; మేము దుర్వాదములను చేయువారి నోడించుటలో నిపుణులము. నిన్ను ధనపరులు సేవించుచున్నారు. బుద్ధి కాలుష్యమును పోగొట్టుకొనగోరువారు మా వలన నుపదేశములను వినుటకై మమ్ము సేవించుచున్నారు. ఓ రాజా! నా యందు నీకు శ్రద్ధలేనిచో నీ యందు నాకును లేదు. ఇదిగో పోవుచున్నాను.

వయ మిహ పరితుష్టా వల్కలైస్త్వం దుకూలై
స్సమ ఇవ పరితోషో నిర్విశేషో విశేషః,
పతు భవతు దరిద్రో యస్య తృష్ణా విశాలా
మనపి చ పరితుష్టే కోర్థఽవాన్? కో దరిద్రః? వైరాగ్య-యతినృపతి-53

నీవు పట్టుబట్టలతో సంతుష్టి పొందుచున్నావు. మేము నారబట్టల తోనే తృప్తిగల్గి యున్నాము. మన యిరువురకును ఈ విషయమున సమానమైన సంతోషమే కలదు. ఎవనికి ఎక్కువ యాశగలదో వాడే దరిద్రుడు. మనస్సు తృప్తి నొందియున్నచో దరిద్రుడెవడు? ధనవంతు డెవడు? 53

యావత్స్వస్థ మిదం శరీరమరుజం యావచ్చ దూరే జరా
యావ చ్చేంద్రియశక్తి రప్రతిహతా యావత్క్షయో నాయుషః,
ఆత్మశ్రేయసి తావదేవ విదుషా కార్యః ప్రయత్నో మహాన్
ప్రోద్దీప్తే భవనే తు కూపఖననం ప్రత్యుద్యమః కీదృశః.
వైరాగ్య-నిత్యానిత్య-75

శరీరము అనారోగ్యముగా లేకుండగానే, ఇంద్రియశక్తి దెబ్బతిన ఆయువు క్షీణింపకమున్నే బుద్ధిమంతుడగు వాడు మోక్షము కొఱకై పవలయును. మృత్యువు మీద పడనుండగా మోక్షము కొఱకై య కొంపయంటుకొనుచుండగా దాని నార్పుటకు బావి త్రవ్వుటవంటిది.

గంగాతీరే హిమగిరిశిలాబద్ధ పద్మాసనస్య
బ్రహ్మజ్ఞానాభ్యసనవిధినా యోగనిద్రాం గతస్య,
కిం తై ర్భావ్యం మమ సుదివసై ర్యత్ర తే నిర్విశంకాః
కండూయన్తే జరఠ హరిణాః శృంగ మంగే మదీయే.
వైరాగ్య-అవధూతచర్య-98

గంగాతీరమున హిమవత్పర్వతశిలలమీద పద్మాసనము వైచుకొని బ్రహ్మజ్ఞానాభ్యాస విధిచేత యోగనిద్రను పొందిన నా శరీరముమీద లేళ్లు తమ కొమ్ముతో రాచుకొను సుదినములు నా కెప్పుడు వచ్చునో కదా!

* * *

# భారవి

## 1. వేగిరపాటు తగదు

పాండవులు ద్వైతవనములో నుండగా ద్రౌపదియు, భీముడును దుర్యోధనాదులపట్ల యుధిష్ఠిరుని శాంతప్రవృత్తిని విమర్శించుచు, తీవ్ర చర్యకు పురికొల్పుచు ప్రసంగింపగా యుధిష్ఠిరుడు వారికిట్లు సమాధానము చెప్పను.

సహసా విదధీత న క్రియా
మవివేకః పర మాపదాం పదమ్,
వృణుతే హి విమృశ్యకారిణం
గుణలుబ్ధాః స్వయమేవ సంపదః. (కిరాతార్జునీయము 2-30)

తొందరపడి యేపనియు చేయరాదు. అవివేకము సకలాపదలకును నిలయము. సంపదలు గుణవంతుల నభిమానించును. విమర్శచేసి కార్యము నాచరించువానిని సంపదలు వానంత నవియే వచ్చి కోరును.

అభివర్షతి యోఽనుపాలయన్
విధిబీజాని వివేకవారిణా,
స సదా ఫలశాలినీం క్రియాం
శరదం లోక ఇవాఽధితిష్ఠతి. 31

తొందరపాటుతో పనిచేయువానికి ఫలసిద్ధి కల్గినను అది కాకతాళీయము. వివేక ముపయోగించు వారికి ఫలసిద్ధి నియతముగా నుండును. కర్తవ్యమనెడు విత్తనములను వివేకమను నీటితో తడిపి చల్లెడువానికా క్రియలు శరత్కాలము పంటను తెచ్చిపెట్టునట్లు ఫలమును సంపాదించి పెట్టును.

శుచి భూషయతి శ్రుతం వపుః
ప్రశమ స్తస్య భవ త్యలంక్రియా,
ప్రశమాభరణం పరాక్రమః
స నయాపాదితసిద్ధిభూషణః. 32

వినిర్మల శాస్త్రజ్ఞానమే మానవున కలంకారము. శాంతియే శాస్త్రమునకు భూషణము. శాంతికి పరాక్రమము ఆభరణము. పరాక్రమహీనుడు

శాంతముగా నుండుటలో విశేషము లేదు. నేర్పరితనముతో సంపాదింపబడిన కార్యసిద్ధియే పరాక్రమమునకు ఆభరణము.

మతిభేదతమస్తిరోహితే గహనే కృత్యవిధౌ వివేకినామ్,
సుకృతః పరిశుద్ధ ఆగమః కురుతే దీప ఇవార్థదర్శనమ్. 33

సందేహాంధకార మలముకొని కర్తవ్య విధానము దురవగాహమై పోయినపుడు బాగుగా నభ్యసింపబడిన పరిశుద్ధమైన శాస్త్రమే దీపమువలె కర్తవ్యమార్గమును కన్పఱచును.

స్పృహణీయగుణై ర్మహాత్మభి శ్చరితే వర్త్మని యచ్ఛతాం మనః,
విధిహేతు రహేతు రాగసాం వినిపాతోఽపి సమ స్సమున్నతేః. 34

ప్రశంసనీయమైన గుణములు గల మహాత్ములచేత ననుసరింపబడిన మార్గమే యితరులకు అనుసరణీయము. అట్లనుసరించువారి కొకవేళ దైవికముగా విపత్తుకల్గినను అది అభ్యున్నతిగానే పరిగణింపదగినది. ఆ సన్మార్గాచరణమువలన ఈ విపత్తు రాలేదని తెలిసికొనవలయును.

శివ మౌపయికం గరీయసీం ఫలనిష్పత్తి మదూషితా యతిమ్,
విగణయ్య నయంతి పౌరుషం విజితక్రోధరయా జిగీషవః. 35

ఇతరులను జయింపదలచిన రాజులు ముందుగా తమ క్రోధవేగములను జయించుకొనవలయును. తమ విజయము వలన గలుగు ఫలము తగినంత గొప్పదగునో కాదో చూచుకొనవలయును. తాత్కాలికముగా గలుగు నీ విజయమువలన భవిష్యత్కాలములో ననర్థము కల్గునేమోకూడ చూచుకొనవలయును. అంతియే కాదు, అమంగళసాధనముల ద్వారమున కార్యసిద్ధిని సంపాదింపరాదు. ఉపాయముతో పురుషకారమును మేళనము చేయవలయును.

అపనేయ ముదేతు మిచ్ఛతా తిమిరం రోషమయం ధియా పురః,
అవిభిద్య నిశాకృతం తమః ప్రభయా నాంశుమతా ప్యుదీయతే. 36

అభ్యుదయములను పొందగోరువాడు తన రోషమను తమస్సును ముందుగా పోగొట్టు కొనవలయును. అట్లుకాదేని వాడభ్యుదయము నొందజాలడు. సూర్యుడుకూడ చీకటి పోయిన పిమ్మటనేకాని యుదయింపజాలడు కదా!

బలవానపి కోపజన్మన స్తమసో నాభిభవం రుణద్ధి యః,
క్షయపక్ష ఇవైందవీః కలాః సకలా హన్తి స శక్తిసంపదః. 37

ఎంత బలవంతుడైనను కోపమువలన పుట్టిన తమస్సును (తమో గుణవి జృంభణమును, చీకటిని) అణచుకొనడేని వాడు కృష్ణపక్షము చంద్రకళలను పోగొట్టుకొనునట్లు సర్వశక్తులను పోగొట్టుకొనును.

సమవృత్తి రుపైతి మార్దవం సమయే యశ్చ తనోతి తిగ్మతామ్,
అధితిష్ఠతి లోక మోజసా స వివస్వానివ మేదినీపతిః. 38

మృదుత్వమునుకాని తీవ్రతను కాని తగిన సమయమందే భూపాలుదు కన్పఱుపవలయును. అపుడే యాతడు లోకమును స్వాధీనము చేసికొన గల్గును. ఎపుడు శాంతింప వలయునో యెపుడు విజృంభింపవలయునో యెఱింగిన వాడు కావుననే సూర్యుడు సకల లోకాధిపత్యమును పొంది యున్నాడు.

ఉపకారక మాయతే ర్భృశం ప్రసవం కర్మ ఫలస్య భూరిణః,
అనపాయి నిబర్హణం ద్విషాం న తితిక్షా సమమస్తి సాధనమ్. 43

ఓర్పుతో సమానమైన సాధనము లేదు. అది శత్రునాశనము చేయగ లదు. మహాఫలమును సంపాదించిపెట్టును; ఉత్తరకాలములో శుభమును సంపాదించుటకు మరింత సమర్థమైనది. ఇన్ని యుపకారములను గావించు క్షాంతి యొకప్పుడును అపాయమునకు దారి తీయదు.

మదమాన సముద్ధతం నృపం న వియుఙ్క్తే నియమేన మూఢతా,
అతిమూఢ ఉదస్యతే నయా న్నయహీనా దపరజ్యతే జనః.
అపరాగ సమీరణేరితః క్రమశీర్ణాకులమూల సంతతిః
సుకరస్తరువ త్సహిష్ణునా రిపు రున్మీలయితుం మహానపి. 50

పొగరు, అహంకారము గల రాజును మూఢత్వ మెన్నడును విడిచి పెట్టదు. మూఢుడు నీతిమార్గమునుండి తొలగిపోవును. నీతి తొలగిన వాడు ప్రజల ఆదరమునుండి తొలగిపోవును.

ప్రజలచే ద్వేషింపబడు రాజు గాలికి కదలిపోయిన చెట్టువలె సడలి పోవును. ఆ చెట్టుయొక్క వేళ్లు క్రమముగా శిథిలములై పోవునట్లు దాని

ప్రకృత్యాది స్వజనములే వానికి దూరమై పోదురు. తుద కా చెట్టువలెనే రాజు సులువుగా పెరికి వేయబడును.

మతిమా న్వినయ ప్రమాథినః సముపేక్షేత సమున్నతిం ద్విషః,
సుజయః ఖలు తాదృగంతరే విపదంతా హ్యవినీతసంపదః. 52

బుద్ధిమంతుడైన వాడు నీతిని విడచి పెట్టిన శత్రువును సంహరించుటకు ప్రయత్నింపడు. వా డెంతయున్నతిలో నున్నను చూచుచు నూఱకుండును. ఎందవల్లననగా వాని యవినీతియె వానిని అవకాశము వచ్చినపుడు నాశనము చేయును, దుర్జనుని సంపదలు ఆపదలతోనే యంతమగును గదా!

---

## 2. మహాపురుష సందర్శనము

తత శ్శరచ్చంద్రకరాభిరామై రుత్సర్పిభిః ప్రాంశుమివాంశుజాలైః,
బిభ్రాణ మావీలరుచం పిశంగీ ర్జటాస్తటి ర్ద్యుంత మివాంబువాహమ్.
3-1

శరత్కాల చంద్రకిరణములవలె మనోహరములైన కాంతులను గల్గి వ్యాసమహర్షి ద్వైతవనములోనున్న పాండవుల వద్దకు వచ్చెను. ఆ కాంతులు పైకి ప్రసరించుచుండుటచే నాతడు ఎత్తులో పెరిగినట్లు కన్పట్టు చుండెను. నీలవర్ణము గల యాతని దేహముపై పచ్చని జడలు వ్యాపింపగా మేఘము మీద మెరుపు తీగెలు ప్రకాశించు తెఱంగు గోచరించెను.

ప్రసాదలక్ష్మీం దధతం సమగ్రాం వపుః ప్రకర్షేణ జనాతిగేన,
ప్రసహ్య చేతస్సు సమాసజంత మసంస్తుతానా మపి భావ మార్ద్రమ్. 2

ఆ మహర్షి లోకాతీతమైన శరీర సౌభాగ్యముచేత ప్రసన్నతాలక్ష్మిని ధరించుచున్నవాడై యాయన వ్యాస మహర్షియని తెలియనివారికికూడ మనస్సును స్నేహముచే ద్రవీభూతము గావించుచుండెను.

అనుద్ధతాఽకారతయా వివిక్తాం తన్వంత మంతఃకరణస్య వృత్తిమ్,
మాధుర్య విస్రంభ విశేషభాజా కృతోపసంభాష మివేక్షితేన. 3

ఆ మహర్షి శాంతాకారముచేతనే యంతఃకరణముయొక్క ప్రశాంతత వెల్లడియగుచుండెను. ఆయన చూపులో మాధుర్య ముట్టిపడు చుండెను. మరియు నెదుటివానికి విశ్వాసమును జనింపజేయు లక్షణముండెను. అట్టి దృష్టిచేతనే యాయన సంభాషణము నెఱపుచున్నాడా యను నట్లుండెను.

ధర్మాత్మజో ధర్మ నిబంధినీనాం ప్రసూతి మేనః ప్రణుదం శ్రుతీనామ్,
హేతుం తదభ్యాగమనే పరీప్సుః సుఖోపవిష్టం ముని మాబభాషే. 4

అగ్నిహోత్రాది ధర్మప్రతిపాదకములు, పాపనాశకములునగు వేదములకు నిధానమైన యా వ్యాసుని సుఖాసీనుని చేసి యుధిష్ఠిరు డాయన రాకకుగల కారణము నెఱుగ గోరి యిట్లు పలికెను.

అవాప్త పుణ్యోపచయై ర్దురాపా ఫలస్య నిర్ధూతరజా స్సవిత్రీ,
తుల్యా భవద్దర్శన సంపదేషా వృష్టే ర్దివో వీతబలాహకాయాః. 5

తలవనితలంపుగా వచ్చిన నీ దర్శనము మేఘములు లేని యాకాశమునుండి పడిన వర్షమువలె నున్నది. వర్షమువలెనే నీ దర్శనముకూడ రజస్సును (1 రజోగుణమును, 2 ధూళిని) అణచును; చక్కని ఫలము (1 శ్రేయస్సను పంటను) నొసగును. పుణ్యవంతులకేకాని నీ దర్శనము లభ్యముకాదు.

అద్య క్రియాః కామదుఘాః క్రతూనాం
సత్యాశిష స్సంప్రతి భూమిదేవాః,
ఆసంస్మృతే రస్మి జగత్సు జాత
స్త్వయ్యాగతే యద్బహుమానపాత్రమ్. 6

నేను చేసిన యజ్ఞము లిపుడు ఫలప్రదములైనవి. బ్రాహ్మణులు నాకొసగిన యాశీర్వచనము లిపుడు యథార్థములైనవి. ఎందువల్లననగా: నీ రాకచే నేను ఈ సృష్టిలోని సమస్త జగత్తులలో మాన్యుడ నైతిని.

శ్రియం వికర్ష త్యపహం త్యఘాని
శ్రేయః పరిస్నోతి తనోతి కీర్తిమ్,
సందర్శనం లోకగురో రమోఘం
తవాత్మయోనే రివ కిం న ధత్తే? 7

నీ దర్శనము చతుర్ముఖుని దర్శనమువలె వైశ్వర్యము నొసగును. పాప ములను పోగొట్టును. శ్రేయస్సు నొసగును, కీర్తిని వ్యాపింపచేయును. మరి యే శుభము నొసంగదు?

శ్వ్యేతమ్మయూఖేఽపి హిమద్యుతౌ
మే వ నిర్వృతం నిర్వృతి మేతి చక్షుః,
సముజ్ఘిత జ్ఞాతివియోగఖేదం
త్వత్సన్నిధా వుచ్ఛ్వసితీవ చేతః. 8

ప్రేమాస్పదులైన నా బంధువులను విడచిపెట్టివచ్చిన పిమ్మట నా మనస్సు అమృతనిష్యందులైన చంద్రకిరణములలో కూడ సంతోషమును పొందజాలకున్నది, ఇపుడు నిన్ను చూచుటవలన నాకు బంధు వియోగఖే దము పోయినది. నీ సన్నిధిలో నా మనస్సుపశాంతిని పొందుచున్నది.

నిరాస్పదం ప్రశ్నకుతూహలిత్వ
మస్మాస్వధీనం కిము నిస్పృహాణామ్,
తథాపి కల్యాణకరీం గిరం తే
మాం శ్రోతు మిచ్ఛా ముఖరీకరోతి. 9

మీ రెందులకు దయచేసినారో యడుగుటకుకూడ నవసరము కన్ప ట్టదు. నిస్పృహులైన తమవంటివారికి మావలన కావలసిన దేముండును? అయినను కల్యాణకరమైన మీమాట వినవలయునను కోరిక నన్ను పురికొ ల్పుటచే ప్రశ్నించుచున్నాను.

ఇత్యుక్తవా సూక్తివిశేష రమ్యం
మవస్థమాధాయ జయోపపత్తౌ,
ఉదారచేతా గిర మిత్యుదారాం
ద్వైపాయనేనాఽభిదధే నరేంద్రః. 10

ధర్మజు డిట్లు వాగ్వైచిత్ర్య రమ్యముగా పలికెను. ఉదారచేతస్కు డయిన కృష్ణద్వైపాయనుడు పాండవుల జయము నుద్దేశించినవాడై యిట్లుపలికెను.

చికీర్షతాం జన్మవతా మలఘ్వీం
యశోఽవతంసా ముభయత్ర భూతిమ్,

అభ్యర్థితా బంధుషు తుల్యరూపా
వృత్తిర్విశేషేణ తపోధనానామ్. 11

అల్పేతరమును, యశోభూషణమును అగు శ్రేయస్సును ఇహ పరలోకములలో సంపాదించుకొనగోరువారికి బంధువు లెల్లరిపట్లను సమాన దృష్టియే యుండవలయును. ఈ సమదృష్టి తపోధనులకు మరింత ముఖ్యము.

తథాఽపి విఘ్నం వృప తావకీనైః
ప్రహ్వీకృతం మే హృదయం గుణౌఘైః,
వీతస్పృహాణా మపి ముక్తిభాజాం
భవంతి భవ్యేషు హి పక్షపాతాః. 12

అట్లయినను ఓ రాజా, నా మనస్సు నీ సద్గుణముల చేత ఆకర్షింప బడినదై నీ కధీనమైనది. సర్వవాంఛా నివృత్తికలిగి మోక్షముపొందిన వారికికూడ సత్పురుషుల పట్ల పక్షపాతము తప్పదు కదా!

సభ శ్చ్యుతాయాం సమితౌ రిపూణాం
ధర్మ్యాం దధానేవ ధురం చిరాయ,
త్వయా విపత్స్వ ప్యవిపత్తిరమ్య
మావిష్కృతం ప్రేమ పరం గుణేషు. 15

శత్రువుల సభ యంతయు దారితప్పి ద్రౌపదీ పరాభవమును సహింపగా ధర్మధురంధరుడవుగా నిలచితివి. ఆపత్తులయందుకూడ సడలని చక్కని గుణపక్షపాతమును నీవు ప్రదర్శించినావు.

విధాయ విధ్వంస మనాత్మనీనం
శమైకవృత్తే ర్భవతశ్ఛలేన,
ప్రకాశిత త్వన్మతి శీలసారాః
కృతోపకారా ఇవ విద్విష స్తే! 16

శాంతి ప్రధానుడవైన నీకు కౌరవులు కపటముచేత హానిని గల్గించిరి. అది వారికే యనర్థదాయక మగుచున్నది. దానివలన వారి దౌర్జన్యము, నీ సౌజన్యము లోకమునకు తెలిసినవి. బాధలు కల్గుచున్నకొలదియు సుజనుని గుణములు వెల్లడియగుచుండును.

మహత్త్వ యోగాయ మహామహిమ్నా
మారాధవీం తాం నృప దేవతానామ్,
దాతుం ప్రదానోచిత భూరిధామ్నా
ముపాగత స్సిద్ధి మివాఽస్మి విద్యామ్. 23

ఓ రాజా! ఒక మంత్రవిద్య నొసగుటకు నే నిటకు వచ్చి యున్నాను. ఇంద్రాది దేవతల నారాధించుటకు సాధన భూతమగు నా మహాతేజ స్సంపన్నమయిన మంత్రము ననుష్ఠించి యర్జునుడు యుద్ధములో ప్రకర్షను సంపాదించి నీకు జయమును సాధింపగలడు. నే నిపుడు మంత్రమునే కాదు మంత్రసిద్ధినే యొసగుచున్నానని గ్రహింపుము. ఇట్టి యుత్కృష్ట దానమునకు నీ వర్హుడవు.

విర్యాయ విద్యాఽథ దినాదిరమ్యా
ద్బింబా దివాఽర్కస్య ముఖా న్మహర్షేః,
పార్థాననం వహ్నికణావదాతా
దీప్తిః స్ఫురత్పద్మ మివాఽభిపేదే. 25

అంత సూర్యకిరణము వికసించుచున్న పద్మమును ప్రవేశించునట్లు వ్యాసమహర్షి ముఖమునుండి యగ్నికణము వలె వెల్వడిన మంత్రవిద్య యర్జునుని ముఖమును ప్రవేశించెను.

అనేన యోగేన వివృద్ధతేజా
నిజాం పరస్మై పదవీ మయచ్ఛన్,
సమాచరా చార ముపాత్తశస్త్రో
జపోపవాసాభిషవై ర్మునీనామ్. 28

పిమ్మట వ్యాసమహర్షి యర్జునున కిట్లుపదేశముచేసెను; ఈ యోగము చేత వృద్ధిపొందిన తేజస్సుగలవాడవై యితరులకు ప్రవేశము నొసగక, శస్త్రమును గ్రహించియే జపమును, ఉపవాసములను, స్నానములను ఆచరించుచు మునివ్రతము నవలంబించియుండుము.

కరిష్యసే యత్ర సుదుశ్చరాణి
ప్రసత్తయే గోత్రభిద స్తపాంసి,
శిలోచ్చయం చారుశిలోచ్చయం త
మేష క్షణా న్నేష్యతి గుహ్యకస్త్వామ్. 29

క్షేత్ర విశేషమునుబట్టి తపస్సిద్ధి యుండును గావున నీవు ఇంద్రకీల పర్వతమున కేగి యింద్రానుగ్రహార్థమై తపస్సు నాచరింపుము. ఆ పర్వత శిఖరమునకు నిన్నీ యక్షుడు క్షణములో తీసికొనిపోగలడు.

ఇతిబ్రువాణేన మహేంద్రసూనుం
మహర్షిణా తేన తిరోబభూవే,
తం రాజరాజానుచరోఽస్య సద్యః
ప్రదేశ మాదేశ ఇవాఽధితస్థౌ. 30

అర్జునునితో నిట్లు మాట్లాడుచునే వేదవ్యాసమహర్షి యంతర్ధాన మొందెను. ఆ క్షణముననే కుబేరానుచరుడైన యక్షు డర్జునుని, ఇంద్రకీల పర్వతమునకు తీసికొనిపోవుటకై యచటకు వచ్చి నిలిచెను.

* * *

# వేదాంతదేశికులు

## (వేంకట యజ్వా)

వీరో రస ఇవోత్సాహా న్నహుషా దభ్యజాయత,
యయాతి ర్నామ యేనైంద్రమర్ధాసన మధిష్ఠితమ్.

(యాదవాభ్యుదయము. ప్రథమ సర్గ.16)

ఉత్సాహమునుండి వీరరసము పుట్టినట్లు నహుషునుండి యయాతి జన్మించెను - ఒకప్పు డా యయాతి దేవేంద్రుని యర్ధాసనము నధిష్ఠించెను.

నిదేశం తస్య రాజానో న శేకు రతివర్తితుమ్,
ప్రాప్త స్య పర నిర్వాణం ప్రమాణ మివ వాదినః. 18

వాదసమయములో ప్రతివాది నోటి నరికట్టుటకు వాది, యుభయులకు ప్రమాణభూతమైన గ్రంథమునుండి వాక్యము నుదాహరింపగా, ప్రతివాది మిన్నక దానిని గ్రహించునట్లు, ఆ యయాతి వాక్యమును మిగిలిన రాజు లెల్లరు శిరసావహించు చుండిరి.

దేహీతి వదతాం ప్రాయః ప్రసీద న్నిత్యువాచ సః,
లలిత ధ్వనిభి ర్లక్ష్మీ లీలా కమల షట్పదైః. 21

యాచకు లాతనిని దేహియని యడుగగా నాతడు అనుగ్రహించిన వాడై లక్ష్మీదేవియొక్క లీలాకమలమందలి తుమ్మెదల లలితధ్వనుల మూలముననే తరచుగా సమాధానము చెప్పుచుండెను. (అడుగుటయే తడవుగా నైశ్వర్యమును కురిపించెడివాడు)

స చ వృత్తవిహీనస్య న విద్యాం బహ్వమన్యత,
నహి శుద్ధేతి గృహ్యేత చతుర్థీ చంద్రచంద్రికా. 22

శీల రహితుడైన విద్యావంతు నాత డెన్నడును గౌరవింపలేదు. పరిశు భ్రముగా నున్నదికదాయని చతుర్థీచంద్ర చంద్రిక గ్రహింప తగదు గదా!

అపునః ప్రార్థనీయస్య ప్రార్థితాధికదాయినః,
అర్థినః ప్రథమే తస్య చరమాన్ పర్యపూరయన్. 23

ఆ యదువు నెవ్వడైనను ఒక్కసారియే యర్థించిన చాలును; కావలసి నదాని కంటె హెచ్చుగా యాచకుడు పొందగలడు. ఆ తరువాత మరొక యాచకు డాతనివద్దకు రానున్నచో సమృద్ధిగా దానమును పొందియున్న యా మొదటి యాచకుడే రెండవవాని కోరికలను పూర్తిగా తీర్చి పంపి వేయగలడు. అంత సమృద్ధిగా నాతడు యాచకులకు దానము చేయుచుం డెను.

స విష్ణు రివ లోకానాం తపన స్తేజసా మివ,
సముద్ర ఇవ రత్నానాం సతా మేకాశ్రయోఽ భవత్. 30

ఆ యదువంశమున వసుదేవు డుదయించెను. ఆతడు సమస్తలోకము లకు విష్ణువువలె, తేజస్సులకు సూర్యునివలె, రత్నములకు సముద్రుని వలె సత్పురుషుల కెల్లరకు ఏకాశ్రయుడుగా నుండెను.

అక్షుద్రగతిశాలిన్యో స్తయో రన్యోన్య సక్తయోః,
ఏకరస్య మభూ త్పత్న్యో గంగా యమునయో రివ. 32

ఆ వసుదేవునకు దేవకి, రోహిణి యను నిరువురు సాధు స్వభావలైన భార్యలుండిరి. గంగా యమునా నదులు రెండును కలసి సముద్రునిలో చేరి రసైక్యమును చెందినట్లు వీరిరువురు నైకమత్యము నొంది భర్తయైన వసుదేవుని ప్రేమ రసమును సమానముగా ననుభవించిరి.

అలిప్సత న సామ్రాజ్యం సోఽర్థకామ పరాఙ్ముఖః,
యదృచ్ఛాగత మైశ్వర్య మావృణ్యరుచి రప్యభూత్. 42

ఆ వసుదేవుడు అర్థకామ పరాఙ్ముఖుడై ధర్మైకదృష్టియై సామ్రాజ్య మును కోరకుండెను - దేవతల ఋణమును, పితృదేవతల ఋణమును తీర్చుటకు కొంత యైశ్వర్యము కావలసియుండును, గావున యదృచ్ఛాలబ్ధ మైన యైశ్వర్యమును మాత్రము స్వీకరించెను.

తతస్తం దదృశు ర్దేవాః శేష పర్యంక మాస్థితమ్,
అధిరూఢ శరన్మేఘ మన్యాదృశ మివాఽంబుదమ్. 66

ఇంతలో కంసాది రాక్షసుల వలన భూదేవికి కల్గుచున్న విపత్తును తొలగించుటకు అవతరింపవలసినదిగా దేవత లెల్లరు శ్రీ మహా విష్ణువును

ప్రార్థించిరి. శరత్కాల మేఘము వలె తెల్లగా నున్న శేష శయ్యపై నీల మేఘము వలెనున్న శ్రీ మహావిష్ణువు వారికి దర్శన మొసగెను.

సుకుమార సుఖస్పర్శ సుగంధిభి రలంకృతమ్,
స్వవిగ్రహ గుణారామ ప్రసూనై రివ భూషణైః. 68

సుకుమారములు, సుఖకరస్పర్శములు, పరిమళవంతములునైన భూషణ ములతో నా ప్రభు వలంకరింపబడి యుండెను. సమస్తకల్యాణగుణములకు ఆశ్రయమైన ఆయన శరీర మనెడు ఉద్యానవనములో పుట్టిన పుష్పములా యనునట్లా యాభరణము లుండెను.

ఆరంజిత జగన్నేత్రై రన్యోన్య పరికర్మితైః,
అంగై రమిత సౌందర్య మనుకల్పితభూషణమ్. 69

ఆ దివ్యమంగళవిగ్రహము సమస్త జగత్తునకు నేత్రానందదాయకముగా నుండెను. ఒక యవయవము మరొక యవయవము యొక్క శోభను పెంచుచుండెను.

ఆ యవయవముల సౌందర్యము ముందర ఆభరణముల శోభ యప్ర ధానమై పోయెను.

అనపాయం త మాదిత్య మక్షయం తారకాధిపమ్,
అపార మమృతాంభోధి మమన్యంత దివౌకసః 74

దేవత లా విష్ణువును ఎన్నడును అస్తమింపని సూర్యుని గాను, ఎన్నడు క్షీణ్యమునందని చంద్రునిగాను, అంతము లేని అమృత సముద్రముగాను భావించిరి.

మయి స్థితే విశ్వగురౌ చ కృష్ణే మా భూద్భువో భార ఇతీవ మత్వా,
పక్షీజనానా మవలంబ్య హస్తాన్ సంచారలీలాం శనకై శ్చకార. 2-31

కృష్ణుని గర్భమందు ధరించిన దేవకి చెలికత్తెల హస్తముల నూతగా గొని నెమ్మది నెమ్మదిగా నడువదొడంగెను. విశ్వగురుడు (వహింపరాని బరువుగల పరమేశ్వరుడు) నాలో నుండగా నా బరువును భూదేవి వహిం పజాల దేమో యను భీతిచే నామె యిట్లు నడచెను.

ముకుందగర్భా ముకురేషు దేవీ
వా౽పశ్య దాత్మాన మవాప్తభూషా,
వాథత్విషా నందక దర్పణేనా౽
దిదృక్ష తాత్మాన మదృశ్య మన్యైః. 32

ముకుందుని గర్భమందు ధరించిన యా దేవకీదేవి ముకురములలో (అద్దములలో) తన్ను చూచుకొనలేదు. తన లోపలనున్న జగన్నాథుని హస్తములో ప్రకాశించుచున్న నందకమను ఖడ్గములోనే యామె యాభరణ భూషితమైన శరీరమును చూచుకొనుటకు కోరుచుండెను.

ప్రజః ప్రభూతా న శశాక వోఢుం
దూరే కథా రత్నవిభూషణానాం,
భవిష్యతి క్షోణిభరాపనోదే
ప్రత్యాయనం ప్రాథమికం తదాపీత్. 33

గర్భిణియైన యా దేవకి శరీరము మీద పూలమాలలను కూడ వహించుట కిష్టపడలేదు; రత్న విభూషణముల సంగతి చెప్పనక్కఱయే లేదు. ఈమె గర్భధారణమునకు ఫలితముగా భూదేవికి భారము తగ్గబోవు చున్నదను నమ్మకము దీని వలన నెల్లరకు కలుగుచుండెను.

అలక్ష్యత శ్యామల మంతరిక్షం
తారాభి రాదర్శిత మౌక్తికౌఘమ్,
వివత్స్యతే విశ్వపతే రవన్యాం
కాలేన భృత్యేన కృతం వితానమ్. 46

భగవాను దుదయింప నున్న యా యష్టమి రాత్రియందు నల్లని యాకాశము మీద నక్షత్రము ప్రకాశించుచుండగా నది భూలోకము మీదికి రానున్న జగత్పతి గౌరవార్థము కాలమనెడు సేవకుడు పట్టుచున్న వితానమా (చాందినియా) యను నట్లుండెను.

తమః ప్రసంగేవ విముచ్యమానా
గౌరప్రభా గోత్రభిదా౽భివంద్యా,
విధూదయారంభ విశేషదృశ్యా
ప్రాచీ దిశా౽భాపత దేవకీవ. 51

ఆ యష్టమి నాడు చంద్రోదయమగు నప్పటికి ప్రాగ్దిక్కునకును దేవకీ దేవికిని సమానలక్షణములే యుండెను. ఇరువురకును తమో విమోచనము గల్గెను. ప్రాగ్దిక్కునకు చీకటి తొలగెను. దేవకికి పరమేశ్వర సన్నిధిచే తమోగుణము తొలగెను. ఇరువురకును తెల్లదన మతిశయిల్లెను. వెన్నెల వలన దిక్కునకును, గర్భిణీ లక్షణముగా దేవకిని తెల్లదన మతిశయించెను. ఇరువురును దేవేంద్రునిచే నభినందింప బడుచుండిరి. ప్రాగ్దిశ దేవేంద్రుని ప్రియురాలగుట వలనను, దేవకి దేవహితము నాచరింపనున్న కృష్ణుని కనుట వలనను ఇంద్రునిచే నభినందింపబడిరి. చంద్రోదయము వలన ప్రాగ్దిక్కును కృష్ణోదయము వలన దేవకియు ప్రకాశమాన లయిరి.

నిశాకరో వారనిధిస్వనానాం
విస్ఫారకం కుందరుచి శ్చకాశే,
ఉదేష్యత శ్చక్రభృతో నియోగాత్
ప్రాదుర్భవన్ ప్రాగివ పాంచజన్యః. 63

తన జన్మమునకు పూర్వమే భూలోకములో నుదయింప వలసినదని విష్ణువుచే నాజ్ఞాపింపబడి యుదయించు చున్న పాంచజన్యశంఖమా యను నట్లు చంద్రు డుదయించెను. శంఖము సముద్రధ్వని వంటి ధ్వనిని వ్యాపింప చేయును. చంద్రుడును సముద్రధ్వనిని పెంచును. శంఖము వలెనె చంద్రుడును కుంద ధావళ్యముతో ప్రకాశించుచున్నాడు.

స్వమధ్య సంపన్న విశుద్ధధామా
శ్యామా చ సా దేవకనందనీ చ,
తమః క్షిపన్త్యౌ జగతాం త్రయాణా
మన్యోన్య సంవాద మివాఽన్వభూతామ్. 73

తన మధ్యమున (అనగా అర్ధరాత్రమున) శుద్ధ తేజః స్వరూపుడైన చంద్రుని ధరించిన ఆ రాత్రియు, తన మధ్యము (అనగా గర్భమున) శుద్ధ తేజస్స్వరూపుడైన భగవంతుని ధరించిన దేవకియు నొకరి నొకరు పోలి యుండిరి. ఇరువురును కూడ ముల్లోకముల తమస్సును పోగొట్టు తేజస్సులను ధరించిన వారు --

నభస్తుషారాంశుమయూఖ యోగాత్
తమిస్రయా మోక్ష మవిందతేవ,

అతృష్యత సత్త్వవిదో నిశాయా
మన్తర్ముఖం చిత్తమివాత్మయోగాత్. 87

తృష్ణా రహితుడైన తత్త్వవేత్తయొక్క మనస్సు రాత్రి కాలమున అంతర్ముఖమై యాత్మానుసంధానము వలన అవిద్య నుండి ముక్తిని పొందినట్లు ఆ యష్టమి నాటి రాత్రి సమయమున ఆకాశము చంద్ర సమాయోగము వలన నంధకారము నుండి మోక్షము నొందెను.

సహోదితా చంద్రమసాఽ వభాసే
జ్యోత్స్నా పయోధే రుపజాతరాగా,
తదాతనే సంజననేఽపి శౌరేః
సహాయినీ సాగరసంభవేవ. 88

చంద్రునితోబాటు సముద్రము నుండి పుట్టిన వెన్నెల ఎఱుపు చాయతో కూడినదై నూతనావతారము నెత్తుచున్న తన భర్తయైన విష్ణువునకు సహాయముగా నుండుటకై వచ్చిన సాగర సంభవయైన లక్ష్మీదేవి వలె ప్రకాశించెను.

భాగేన పూర్ణేన తమోగుణేన
ప్రకాశపూర్ణేన చ పశ్చిమేన,
తదా నిశీథ స్స సతాం ప్రసత్త్యై
సంసార ముక్త్యోరివ సంధి రాసీత్. 90

శ్రీకృష్ణుడు జనన మొందిన యా నిశీథ సమయమునకు పూర్వపుదైన రాత్రిభాగము చీకటితో నిండియుండెను. అట్లే తర్వాతి రాత్రిభాగము వెన్నెలతో నిండియుండెను. చీకటికిని వెలుగునకును మధ్య నుండిన ఆ అష్టమీ నిశీథ సమయము తమోగుణ భూయిష్ఠమైన సంసారమునకును సత్త్వగుణ భూయిష్ఠమైన ముక్తిస్థితికిని మధ్యావస్థ వలె సత్పురుషులకు సంతోషదాయకముగ నుండెను.

* * *

# శ్రీశంకరాచార్యులు

## 1. శివానందలహరి

ప్రభుస్త్వం దీనానాం ఖలు పరమబంధుః పశుపతే!
ప్రముఖ్యోఽహం తేషా మపి కిముత బంధుత్వ మనయోః,
త్వయైవ క్షంతవ్యాః శివ! మదపరాధాశ్చ సకలాః
ప్రయత్నా త్కర్తవ్యం మదవన మియం బంధుసరణిః. 14

ఓ పశుపతీ! నీవు దీనబాంధవుడవు. నేను దీనులలో మొదటి వాడను. కావున మన యిరువురికి బంధుత్వ మున్నదని వేఱుగ చెప్పనక్కరలేదు. నా యపరాధముల నన్నింటిని నీవు క్షమింపవలయును. ఇది బంధుమర్యాద గదా!

ఉపేక్షా నోచే త్కిం న హరసి భవద్ధ్యాన విముఖాం
దురాశాభూయిష్ఠాం విధిలిపి మశక్తో యది భవాన్,
శిరస్తద్వైధాత్రం న న ఖలు సువృత్తం పశుపతే
కథం వా నిర్యత్నం కరనఖముఖేనైవ లులితమ్. 15

ఓ పశుపతీ! నిన్ను ధ్యానించుట కుద్యమింపక దురాశాగ్రస్తమై యున్న నా బుద్ధి యట్లే యుండ వలయునని బ్రహ్మవ్రాసినాడా? నీకు నా పట్ల ఉపేక్ష లేనిచో నా బ్రహ్మవ్రాతను తుడిచి పెట్ట జాలవా? బ్రహ్మయైదవ శిరస్సును గోటితోనే త్రుంచివైచిన నీకు బ్రహ్మవ్రాతను తుడిచి వేయుట కష్టమా?

సదా మోహాటవ్యాం చరతి యువతీనాం కుచగిరౌ
నట త్యాశాశాఖా స్వటతి ఝుడితి స్వైర మభితః,
కపాలిన్ ! భిక్షో ! మే హృదయకపి మత్యంత చపలం
దృఢం భక్త్యా బద్ధ్వా శివ! భవదధీనం కురు విభో. 20

ఓ కపాలీ, నా చిత్తము మర్కటమువలె నిచ్చ వచ్చి నట్లు తిరుగు చున్నది. మోహమనెడు అడవిలోను, కాంతల స్తనములనెడు పర్వతము లలోను పరిభ్రమించుచు ఆశలనెడు కొమ్మలలో నాట్యము చేయుచున్న

యా కోతి యాటలను కట్టించి, ఓ యాదిభిక్షూ! భక్తి రజ్జువుతో దీనిని బంధించి స్వాధీనము చేసి యాడించుకొనుము.

ప్రలోభాద్యై రర్థాహరణ పరతంత్రో ధనిగృహే
ప్రవేశోద్యుక్తస్సన్ భ్రమతి బహుధా తస్కరపతే,
ఇమం చేత శ్చోరం కథ మిహ పహే శంకర! విభో
తవాధీనం కృత్వా మయి నిరపరాధే కురు కృపామ్. 22

నా మనస్సనెడి యా చోరుడు ధనాకర్షణపరుడై ధనికులను వలలో వేసికొనుటకు వారి యిండ్లలో దూరగోరుచు నటు నిటు తిరుగు చున్నాడు. ఈ దొంగకు ఆశ్రయ మిచ్చిన యపరాధము కూడ నాకు లేకుండుటకై వీనిని నీకు స్వాధీనము చేయుచున్నాను. ఓ తస్కర పతీ! నాయందు దయయుంచి వీనిని తీసికొనుము.

కదా వా కైలాసే కనకమణిసౌధే పహగణై
ర్వపన్ శంభో రగ్రే స్ఫుటఘటిత మూర్ధాంజలిపుటః,
విభో సాంబ ! స్వామిన్ ! పరమశివ ! పాహీతి నిగదన్
విధాతౄణాం కల్పాన్ క్షణమివ చ నేష్యామి సుఖతః. 24

కైలాస పర్వతము మీద కనకమణిసౌధములో ప్రమథ గణములతో కూడిన వాడనై శిరస్సున అంజలి పుటమును బంధించి "ఓ ప్రభూ! సాంబ, స్వామీ, పరమశివా రక్షించుము" అని ప్రార్థించుచు అనేక బ్రహ్మ కల్పములను ఒక్క క్షణమువలె నానందముతో నేను గడపివైచు కాల మెప్పుడు వచ్చునో కదా!

కరస్థే హేమాద్రౌ గిరిశ నికటస్థే ధనపతౌ
గృహస్థే స్వర్భూ జాఽమర సురభి చింతామణిగణే,
శిరఃస్థే శీతాంశౌ చరణయుగళస్థేఽఖిల శుభే
క మర్థం దాస్యేఽహం భవతు భవదర్థం మమ మనః. 24

ఓ గిరీశ! నేను నీ కేమి యీయగలను? మేరు పర్వతము నీ చేతిలో నున్నది; కుబేరుడు నీ సమీపమున నున్నాడు. కల్పవృక్షము, కామధేనువు, చింతామణి మున్నగునవి నీ యింటనే యున్నవి; చంద్రుడు నీ శిరస్సున నున్నాడు; సమస్త శుభములు నీ పాదారవిందముల యందున్నవి.

అట్టిచో నేను నీ కీయగల యర్థ మేమున్నది? నా మనస్సు నీ సేవార్థమే యుండుగాక యని ప్రార్థించుచున్నాను.

సారూప్యం తవ పూజనే, శివ మహాదేవేతి సంకీర్తనే
సామీప్యం, శివభక్తి ధుర్య జనతా సాంగత్య సంభాషణే,
సాలోక్యం చ, చరాచరాత్మక తనుధ్యానే భవానీపతే
సాయుజ్యం మమ సిద్ధ మత్ర భవతి స్వామిన్ కృతార్థోఽ స్మ్యహమ్. 28

ఓ ప్రభూ! సారూప్య, సామీప్య, సాలోక్య, సాయుజ్య ముక్తుల నన్నింటిని నాకీ జన్మములోనే యెప్పటి కప్పుడు చవి చూపుచున్నావు. నిన్ను పూజించు సమయములో నీతో సమానరూపము పొందుచున్నాను. నీ నామ సంకీర్తనము చేయు నపుడు నీ సమీపమునందున్న వాడనగుచున్నాను. నీ సారూప్యము నొందిన శివభక్తి ధురంధరుల సాంగత్యములో నున్నపుడు నీతో సమాన లోకుడ నగుచున్నాను. చరాచరాత్మకమైన యా జగత్తు అనెడు నీ మూర్తిని ధ్యానించు నపుడు నీ సాయుజ్యమును పొందుచున్నాను. ఇక నాకేమి కావలయును? కృతార్థుడనైతిని.

నాలం వా పరమోపకారక మిదం త్వేకం పశూనాం పతే
పశ్య న్కుక్షిగతాన్ చరాచరగణాన్ బాహ్యస్థితాన్ రక్షితుమ్,
సర్వా మర్త్యపలాయనౌషధమితి జ్వాలాకరం భీకరం
నిక్షిప్తం గరళం గళేన గళితం నోద్గీర్ణ మేవ త్వయా. 31

ఓ పరమేశ్వరా, క్షీరసాగర మథన సమయమున హాలాహలము బయటకు రాగా దేవతలు భీతిల్లి పరుగిడజొచ్చిరి. వారి భీతి నడంచుటకు జ్వాలారూపమైన యా కాలకూటమును నీవు మ్రింగితివి. మ్రింగినది కడుపులోనికి పోవుచో నీ కుక్షిలోనున్న చరాచర గణములు నశించునను కారణమున నీవు దానిని కంఠము దిగనీయ కుంటివి. ఆ విషము బయటకు వచ్చుచో బయటి చరాచరములు నశించునను కారణమున దానిని బయటకు రానీయకుంటివి. కంఠము నందే నిలిపితివి. ఓ పశుపతీ నీ పరోపకార పరాయణత్వమున కీ యొక్క యుదాహరణము చాలదా?

ప్రాక్పుణ్యాచల మార్గదర్శిత సుధామూర్తిః ప్రసన్నశ్శివ
స్సోమ స్సద్గణసేవితో మృగధరః పూర్ణస్తమోమోచకః,
చేతః పుష్కరలక్షితో భవతి చే దానంద పాథోనిధిః
ప్రాగల్భ్యేన విజృంభతే సుమనసాం వృత్తి స్తదా జాయతే. 38

సోమనామాంచితుడైన చంద్రుడు ఆకాశమున నుదయించు నట్లు ఉమా సహితుడైన శివుడు భక్త హృత్పుండరీకమున నుదయించుచో నానందసముద్రము పొంగును. చంద్రుడు పూర్వాచలమున తన యమృత స్వరూపమును కన్పరచునట్లు శివుడును భక్తుని పూర్వపుణ్య స్థిరమార్గ ముచే తన యమృత రూపమును కన్పఱచును. చంద్రుడు నక్షత్రగణ సేవితుడగు నట్లు శివుడు ప్రమథగణ సేవితుడై విరాజిల్లును. ఈ యిరు వురును మృగధరులే? ఇరువురును తమో మోచనులే: అట్లుదయించిన యానందసముద్రము నందు విబుధు లోలలాడుదురు.

ధీయంత్రేణ వచో ఘటేన కవితా కుల్యోపకుల్యాక్రమై
రానీతైశ్చ సదాశివస్య చరితాంభోరాశి దివ్యామృతైః,
హృత్కేదారయుతాశ్చ భక్తికలమా స్సాఫల్యమాతన్వతే
దుర్భిక్షా న్మమ సేవకస్య భగవన్విశ్వేశ భీతిః కుతః.

ఓ భగవానుడా! నాకిక కఱువులేదు; నా హృదయ క్షేత్రమున భక్తి యను వరిపంట పుష్కలముగా పండినది. నీ దివ్యకథ లనెడు అమృత సముద్రము నుండి రసమును బుద్ధి యంత్రముచే వాక్కను ఘటముతో చేదబడి కవితా విశేషము లనెడు కాలువల ద్వారమునను పిల్లకాలువల ద్వారమునను నా హృదయ క్షేత్రమున ప్రవహింపచేయబడినది. దాని వలన నా హృదయము సఫలమయినది.

కారుణ్యామృత వర్షిణం, ఘన విపద్గ్రీష్మ చ్ఛిదాకర్మఠం
విద్యాసస్య ఫలోదయాయ సుమన స్సంసేవ్య మిచ్ఛాకృతిమ్,
నృత్యద్భక్తమయూరమద్రినిలయం చంచజ్జటామండలం
శంభో వాంఛతి నీలకంధర సదా త్వాం మే మనశ్చాతకః. 52

నీలమేఘము వంటి యో నీలకంఠ! (నీలకంధర,) నా మనస్సనెడు చాతకము నిన్ను నిరంతరము కోరుచున్నది. నీవు కారుణ్యా మృతమును వర్షింతువు; మేఘ ముదకమును వర్షించును. నీవు మహా విపత్తులను ఛేదింతువు; మేఘము గ్రీష్మతాపమును ఛేదించును. నీవు జ్ఞానోదయ మును గల్గింతువు. మేఘము పంటకు కారణమగును. నీవు విబుధులచే సేవింపబడువాడవు; మేఘము మంచి కర్షకులచే సేవింపబడునది. నీ వే రూపమునైనను ధరింపగలవు! మేఘము కూడ తన కిచ్ఛ వచ్చిన

రూపమును ధరించుచు నేగుచుండును. నిన్ను చూచి భక్తులు నృత్యము చేయుదురు. మేఘమును చూచి మయూరములు నృత్యముచేయును. నీవు కైలాసగిరిపై నుందువు; మేఘము కూడ పర్వతము నాశ్రయించుకొనును. నీవు చలించుచున్న జటామండలము కలవాడవు; మేఘము ప్రకాశించుచున్న మెఱుపులు కలది. నీలమైన జలధరములకును, నీలమైన కంఠముగల నీకును నిట్టి సాదృశ్యము కలదు.

ఆకాశేన శిఖీ సమస్త ఫణినాం నేత్రా కలాపీనతా౽
నుగ్రాహి ప్రణవోపదేశనినదైః కేకీతి యో గీయతే,
శ్యామాం శైలసముద్భవాం ఘనరుచిం దృష్ట్వా నటంతం ముదా
వేదాంతోపవనే విహారరసికం తం నీలకంఠం భజే. 53

నీలకంఠ మగు నెమలిని పోలిన యీ నీలకంఠుని సేవింతును. ఆకాశమే శిఖండము! సర్పరాజయిన వాసుకియే పింఛము? భక్తానుగ్రాహకములైన యుపదేశములే ధ్వనులు. పర్వతోద్భూతయు మేఘవర్ణయు నగు శ్యామాదేవిని చూచి నృత్యము చేయుచు ఉపనిషదుద్యాన వనమున విహరించు నెమలిని బోలిన నీలకంఠు నేను భజింతును.

హంసః పద్మవనం సమిచ్ఛతి యథా నీలాంబుదం చాతకః
కోకః కోకనదప్రియం ప్రతిదినం చంద్రం చకోరస్తథా,
చేతో వాంఛతి మామకం పశుపతే చిన్మార్గమృగ్యం విభో
గౌరీనాథ భవత్పదాబ్జయుగళం కైవల్య సౌఖ్యప్రదమ్. 59

ఓ పశుపతీ, హంస పద్మవనము కోరునట్లు, చాతకపక్షి నీల మేఘమును కోరునట్లు చక్రవాకము సూర్యుని కోరునట్లు, చకోరము చంద్రుని కోరునట్లు నా మనస్సు కైవల్యసుఖప్రదమును, ఉపనిషన్మార్గ మృగ్యమును అగు నీ పాదపద్మద్వయమును కోరుచున్నది.

అంకోలం నిజబీజసంతతి, రయస్కాంతోపలం సూచికా
సాధ్వీ నైజవిభుం, లతా క్షితిరుహం సింధుస్సరిద్వల్లభమ్,
ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవింద ద్వయం
చేతో వృత్తి రుపేత్య తిష్ఠతి సదా సా భక్తి రిత్యుచ్యతే. 61

ఊడుగ చెట్టు గింజలు క్రిందకు రాలి పోయినను మేఘ ముఖముగనే వానంత నవియే లేచి చెట్టున కంటుకొనును. సూది దానంత నదియే అయస్కాంతమున కంటుకొనును. పతివ్రత సహజముగానే భర్తృలగ్న

చిత్తయగును. తీగె తన చెట్టునకు పెనవైచుకొనును. నది యెవ్వరి ప్రయత్నము లేకుండగనే సముద్రుని చేరుకొనును. అట్లే యెవని చిత్త వృత్తి పరమేశ్వరుని పాదారవిందములను చేరక యుండజాలదో వాడే భక్తుడని తెలియదగును.

అమిత ముదమృతం ముహుర్దుహంతీం
విమల భవత్పద గోష్ఠ మావహంతీమ్,
పదయ పశుపతే సుపుణ్యపాకాం
మమ పరిపాలయ భక్తిధేను మేకామ్. 67

ఓ పశుపతీ! నీ విన్ని పశువులను కాపాడు చున్నావు. నా భక్తి యనెడు నొక్క గోవును కాపాడజాలవా? ఈ గోవు నాకు అమితానంద మనెడు క్షీరము నిచ్చుచున్నది, నీ పాద ద్వయమనెడు గోశాలలో నివసించుచున్నది; బహు పుణ్యము ఫలితముగా నాకు లభించినది. దయతో దీనిని నిలబెట్టుము.

ఏష్య త్యేష జనిం మనోఽస్య కఠినం తస్మిన్న టానీత మ
ద్రాక్షాయై గిరిసీమ్ని కోమలపదన్యాసః పురాఽభ్యాసితః!
నోచేద్దివ్య గృహాంతరేషు సుమనస్తల్పేషు వేద్యాదిషు
ప్రాయ స్సత్సు శిలాతలేషు నటనం శంభో కిమర్థం తవ?

ఓ శంభో! కోమలములైన నీ పాదములతో కఠినములైన కొండ ప్రదేశములలో నెందులకు తిరుగుచున్నావు? తెలిసినది లెమ్ము. "నా భక్తుడైన వీడు జన్మింపనున్నాడు. వీని మనస్సు కఠిన మైనది. ఆ కఠినమైన మనస్సులో నేను సంచరింప వలసియుండును. కావున నిప్పటి నుండియు కఠినస్థల సంచార మలవరచుకొనవలయును" అని నేను జనించుటకు పూర్వమునుండియు కొండలలో తిరుగుచున్నావు. అట్లు కానిచో దివ్య గృహాంతరములు వేదికలు పుష్పశయ్యలు ఉండగా బాళ్ళపైనేల నాట్యము చేయుదువు?

కంచి త్కాల ముమామహేశ భవతః పాదారవిందార్చనైః
కంచి ద్ధ్యాన సమాధిభిశ్చ నతిభిః కంచిత్కథాకర్ణనైః,
కంచి త్కంచి దవేక్షణైశ్చ నుతిభిః కంచిద్దశా మీదృశీం
యః ప్రాప్నోతి ముదా త్వదర్పితమనా జీవన్ స ముక్తః ఖలు.

ఓ ఉమామహేశ! కొంతకాలము నీ పాదారవింద పూజల నాచరించి కొంతకాలము నిన్ను గురించి ధ్యాన సమాధులను అభ్యసించి, కొంతకాలము నీకు నమస్కరించి, కొంతకాలము నిన్ను గురించి పురాణ గాథలను విని, కొంతకాలము నీ మూర్తిని దర్శనము చేసి మానవుడు విసుగనునది లేక సంతోషముతో నిన్ని విధములుగా మనస్సును నీ యందుంచుట నభ్యసించుకొన్నవాడై తుదకు ముక్తిని పొంద గలడు గదా.

శివ తవ పరిచర్యా సన్నిధానాయ గౌర్యా
భవ! మమ గుణధుర్యాం బుద్ధికన్యాం ప్రదాస్యే,
సకల భువనబంధో! సచ్చిదానంద సింధో!
సదయ! హృదయ గేహే సర్వదా సంవస త్వమ్. 84

ఓ సకల భువనబంధూ! నీ పత్నియైన గౌరి నిన్నిపుడు సేవించుచున్నది. ఓ సచ్చిదానంద సముద్రా, ఆ గౌరికి తోడుగా నీ చెంతనుండి నీకు పరిచర్య చేయుటకై నా బుద్ధి యనెడు గుణవంతురాలైన కన్యను నీకు దానము చేసెదను. ఓ దయామయా, (గౌరితండ్రి యింట నీ విపుడు నివసించునట్లే) నా హృదయగృహమందు నీ విక నివసించుచుండుము.

ధైర్యాంకుశేన నిభృతం
రభసా దాకృష్య భక్తిశృంఖలయా,
పురహర చరణాలానే
హృదయ మదేభం బధాన చిద్యంత్రైః. 96

ఓ త్రిపురహర! నా మనస్సనెడి మదపుటేనుగును ధైర్యమను నంకుశముచేతను, భక్తియను గొలుసు చేతను వేగముగను, నెమ్మదిగను ఆకర్షించి దానిని జ్ఞానయంత్రములచేత నీ పాదములకు కట్టివేయుము.

కల్యాణినం సరసచిత్రగతిం సవేగం
సర్వేంగితజ్ఞ మనఘం ధ్రువలక్షణాఢ్యమ్,
చేతస్తురంగ మధిరుహ్య చర స్మరారే
నేత స్సమస్త జగతాం వృషభాధిరూఢ. 75

ఓ సమస్త జగన్నాయక! నీ విపుడు వృషభము నారోహించి సంచరించుచున్నావు. నా మనస్సనెడు గుఱ్ఱముపై తిరుగరాదా? ఈ మనస్సు

కల్యాణలక్షణములు గల్గి పంచకల్యాణివలె నున్నది. రసప్రపూరితమై చిత్రచిత్ర భావములు గలదై చక్కని నడకలుగల యశ్వమువలె నున్నది. ఇతర జన హృదయము నెఱింగినదై ఆరూఢుని చిత్తవృత్తిని గ్రహింపగల యశ్వమువలె నున్నది. స్థిరమైన సల్లక్షణములను గల్గియుండుటలోకూడ నిది యశ్వమును పోలియున్నది. కావున నో మన్మథ సంహారక! నీ విక నా మనస్సనెడు హయము నధిరోహించి సంచరింపవచ్చును.

---

## 2. అద్వైతానుభూతి

అక్షిదోషాద్యథైకోఽపి
ద్వయవ ద్భాతి చంద్రమాః,
ఏకోఽప్యాత్మా తథా భాతి
ద్వయవన్మాయయా మృషా. 4

చంద్రుడొకడే యున్నను కంటిదోషము గలవానికి ఇద్దరు చంద్రు లున్నట్లు కన్పట్టును. అట్లే మిథ్యాజ్ఞానము గలవానికి ఒకే యాత్మ యనేకాత్మలుగా కన్పట్టును.

అక్షిదోషవిహీనానా
మేక ఏవ యథా శశీ,
మాయాదోష విహీనానా
మాత్మైవైక స్తథా సదా. 5

దోషరహితమైన దృష్టికలవానికి చంద్రుడొకడుగానే కన్పట్టునట్లు మాయాదోషము లేనివానికి ఆత్మ యెల్లప్పుడు నొకటిగానే కన్పట్టును.

ద్విత్వం భాత్యక్షిదోషేణ
చంద్రే ప్యే మాయయా జగత్,
ద్విత్వం మృషా యథా చంద్రే
మృషా ద్వైతం తథాఽఽత్మని. 8

కంటిదోషము గలవానికి తాను చూచు చంద్రునియందు ద్విత్వము కన్పట్టునట్లు మాయాదోషము గలవానికి ఆత్మవస్తువు నందు జగద్భావమను ద్వైతబుద్ధి కల్గుచున్నది. వాస్తవముగా రెండవచంద్రుడు లేనట్లే అనాత్మవస్తువు లేదు. 8

ఆత్మనః కార్య ఆకాశో
వినాఽఽత్మానం న సంభవేత్,
కార్యస్య పూర్ణతా సిద్ధా
కిం పునః పూర్ణతాఽఽత్మనః 7

కార్యభూతో యథాకాశ
ఏక ఏవ న హిద్విధా,
హేతుభూత స్తథాఽఽత్మాఽయ
మేక ఏవ విజానతః 8

ఏకోఽపి ద్వయవద్భాతి
యథాఽఽకాశ ఉపాధితః,
ఏకోఽపి ద్వయవత్పూర్ణ
స్తథాఽఽత్మాయ ముపాధితః. 9

ఆకాశము ఆత్మయొక్క కార్యము (ఆత్మనుండి యుత్పన్నమయినది.) కారణము లేనిదే కార్యముండదు. కావున ఆత్మ లేనిదే యాకాశముండదు. కార్యమయిన యాకాశ మొకటియే కాని రెండు కాదు. కావున కారణమయిన యాత్మ కూడ అద్వితీయాఖండవస్తువై యుండవలయును. జ్ఞానికి మరొక విధముగా తోచదు. 7

ఆకాశ మొకటియే యైనను భిన్నభిన్నములైన ఘటములలో నది ప్రతిబింబించు నపుడు అనేకాకాశములున్నట్లు కన్పట్టును. అట్లే ఆత్మ యొకటియే యైనను వివిధ బుద్ధులలో ప్రతిబింబించుచున్నదై యనేకములుగా తోచును.

మేఘయోగా ద్యథావీరం
కరకాకారతా మియాత్,
మాయాయోగా త్తథై వాత్మా
ప్రపంచాకారతా మియాత్. 13

వర్షోపల ఇవాభాతి
నీర మేవాఽభ్రయోగతః,
వర్షోపల వినాశేన
నీరనాశో యథా నహి. 14

ఆత్మైవాయం తథా భాతి
మాయాయోగాత్ ప్రపంచవత్,
ప్రపంచస్య వినాశేన
స్వాత్మనాశో నహి క్వచిత్. 15

నీరు మేఘమును చేరుట వలన వడగల్లు రూపమును పొందునట్లు ఆత్మ మాయాసంయోగము చెందుట వలన జగద్రూపమును పొందుచున్నది.

నీరే మేఘసంయోగము వలన వడగల్లుగా కన్పట్టును. అట్లే మాయాసంయోగము వలన ఆత్మయే ప్రపంచముగా కన్పట్టును. వడగల్లు కరిగిపోయినను నీటికి నాశనము లేదు; అట్లే జగత్తు నశించినను, ఆత్మకు నాశనము లేదు.

జలా దన్య ఇవాభాతి
జలస్థో బుద్బుదో యథా,
తథాఽఽత్మనః పృథగివ
ప్రపంచోఽయ మనేకధా. 16

యథా బుద్బుదనాశేన
జలనాశో నహి క్వచిత్,
తథా ప్రపంచనాశేన
నాశః స్యా దాత్మనో నహి. 17

నీటినుండి బయలు దేరిన బుడగ నీటి కంటె వేరైన దిగా పైకి కన్పట్టుచున్నది. అట్లే ఆత్మనుండి యుత్పన్నమయిన యీ నానాత్వ విలసిత ప్రపంచము ఆత్మకంటె భిన్నముగా నున్నట్లు కన్పట్టు చున్నది.

నీటి బుడగ నశించినను నీటికి నాశనము లేదు. అట్లే ఆత్మనుండి యుత్పన్నమయిన యీ ప్రపంచము నశించినను ఆత్మకు నాశనములేదు.

పిష్టాది ర్గుడసంయోగా
ద్గుడవ త్ప్రీతిమాన్ యథా,
ఆత్మ యోగా త్ప్రమేయాది
రాత్మవ త్ప్రీతిమాన్ భవేత్. 26

ఘటనీరాన్న పిష్టానా
ముష్ణత్వం వహ్నియోగతః,
వహ్నిం వినా కథం తేషా
ముష్ణత్వం స్యా ద్యథా క్వచిత్. 37

భూత భౌతిక దేహానాం
స్ఫూర్తిత్వం స్యాత్మయోగతః,
వినాత్మానం కథం తేషాం
స్ఫూర్తితా స్యాత్తథా క్వచిత్. 28

పిండి మొదలగు వస్తువులు బెల్లముతో కలసినవై బెల్లము వలెనే రుచ్యము లగుచున్నవి. అట్లే సమస్త వస్తువులు ఆత్మతో కూడినవై ఆత్మ వలెనే సుఖప్రదము లగు చున్నవి.

కుండ, నీరు పిండి మున్నగు వానికి అగ్ని సంయోగము వలననే యుష్ణత్వము వచ్చును. అట్లే భూత భౌతిక దేహములకు ఆత్మ సంయోగము వలననే ప్రకాశము గల్గుచున్నది. ఘటాదులకు అగ్ని లేనిదే యుష్ణత్వము లేదు. అట్లే ఆత్మ లేకున్నచో వస్తువునకు ప్రకాశము లేదు- వాని యునికియే గుర్తింపబడదు.

నానావిధేషు కుంభేషు
వసే దేకం నభో యథా,
నానావిధేషు దేహేషు
తథైవైకో వసా మ్యహమ్. 29

నానావిధత్వం కుంభానాం
న యాత్యేవ యథా నభః,
నానావిధత్వం దేహానాం
తద్వదేవ న యామ్యహమ్. 30

యథా ఘటేషు నష్టేషు
ఘటాకాశో న నశ్యతి,
తథా దేహేషు నష్టేషు
నైవ నశ్యామి సర్వగః. 31

వివిధ ఘటముల యందున్న యాకాశ మొక్కటియే. ఎన్ని కుండలున్నవో యన్ని యాకాశములు లేవు. వివిధ దేహముల యందున్న ఆత్మ యొక్కటియే. ఎన్ని దేహము లున్నవో యన్ని యాత్మలు లేవు. ఆత్మ స్వరూపుడనైన నేనే యన్ని దేహములయందు నున్నాను.

ఘటములకు నానాత్వమున్నను ఆకాశమునకు నానాత్వము లేదు. అట్లే దేహములకు నానాత్వమున్నను అందు నివసించు ఆత్మస్వరూపుడనైన నాకు నానాత్వము లేదు.

ఘటములు నశించినను సర్వగతమయిన యాకాశము నశింపదు. అట్లే దేహములు నశించినను సర్వవ్యాపియు ఆత్మస్వరూపుడును అగు నేను నశింపను.

భోక్తా బర్హీ యథా భోగ్యః
సర్పో దృషది కల్పితః,
రూపం శిలాఽ వయో రాత్మా
భోక్తృ భోగ్య స్వరూపకః. 50

ఒక నెమలి పామును తినుచున్నట్లు జాతి మీద చెక్కబడియున్నది. ఇట భోక్తయైన నెమలియు భోగ్యమైన సర్పమును కూడ శిలాస్వరూపములే. అట్లే ప్రపంచములోని సమస్త భోగ్యవస్తువులు ఆత్మస్వరూపములే. భోక్తయు నాత్మస్వరూపుడే.

జ్ఞస్య నాస్త్యేవ సంసారో
యద్య దజ్ఞస్య కర్మిణః,
జానతో నైవ భీ ర్యద్వ
ద్రజ్జుసర్ప మజానతః 51

చీకటిలో త్రాటిని చూచి పామనుకొన్న వానికే భయ కంపాదులు కల్గును. ఇది త్రాడే యని తెలిసికొన్న వానికి భయ కంపాదులు లేవు.

అట్లే బ్రహ్మమును ప్రపంచముగా భావించిన కామ్యకర్మనకే సంసార పరిభ్రమణము కల్గుచున్నది. సర్వము బ్రహ్మమే యని గుర్తించిన వానికి ఆనందానుభూతియే కాని దుఃఖానుభవ మెన్నడును కలుగదు.

సైంధవస్య ఘనో యద్వ
జ్జలయోగా జ్జలం భవేత్,
ఆత్మయోగా త్తథా బుద్ధి
రాత్మవ ద్బ్రహ్మవేదినః.

ఉప్పుగడ్డ నీటితో కలసి నీటియాకారమునే పొందు నట్లు, బ్రహ్మ వేత్త యొక్క బుద్ధి ఆత్మ యోగమువలన ఆత్మాకారమునే పొంది పోవును.

భావో రన్య ఇవాభాతి
జలభానుర్జలే యథా,
ఆత్మనోఽన్య ఇవాభాసో
భాతి బుద్ధౌ తథాఽఽ త్మనః.

బింబం వినా యథా నీరే
ప్రతిబింబో భవే త్కథమ్?
బింబాత్మానం తథా బుద్ధౌ
చిదాభాసో భవేత్కథమ్?

ప్రతిబింబ చలత్వాద్యా
యథా బింబస్య కర్హిచిత్,
న భవేయు స్తథాఽభాన
కర్తృత్వాద్యాస్తు నాఽత్మనః. 56

నీటియందు ప్రతిబింబించిన సూర్యుడు మూలభూతుడైన సూర్యుని కంటె భిన్నుడుగా కన్పట్టుచున్నాడు. అట్లే బుద్ధియందు ప్రతిబింబించిన చిదాభాసుడను ఆత్మయొక్క రూపము ఆత్మకంటె భిన్నమైనదిగా కన్పట్టు చున్నది.

బింబము లేకుండ నీటియందు ప్రతిబింబ మెట్లు కలుగును? ఆత్మ లేకుండ బుద్ధియందు ఆత్మ ప్రతిబింబ మయిన చిదాభాసు డెట్లేర్పడును? జలమందలి ప్రతిబింబము కదలుచున్నను మూలవస్తువగు బింబము కదలుటలేదు. అట్లే బుద్ధి ప్రతిబింబిత చిదాభాసునకు కర్తృత్వ భోక్తృత్వాది

వికారములు కన్పట్టుచున్నను బింబభూతమైన ఆత్మకు కర్తృత్వ భోక్తృత్వా దులు లేవు.

జలే శైత్యాదికం యద్వ
జ్జల భానుం న సంస్పృశేత్,
బుద్ధేః కామాదికం తద్వ
చ్చిదాభాసం న సంస్పృశేత్. 57

బుద్ధేః కర్తృత్వ భోక్తృత్వ
దుఃఖిత్వాద్యైస్తు సంయుతః,
చిదాభాసో వికారీవ
శరావ స్థాంబుభానువత్. 58

శరావస్థోదకే నష్టే
తత్థ్సభాను ర్వినష్టవత్,
బుద్ధే ర్లయే తథా సుప్తో
నష్టవ ట్ప్రతిభాత్యయమ్. 59

జలమందలి శీతలత్వము మున్నగు లక్షణములు జల సూర్యున కంటవు. అట్లే బుద్ధియొక్క కామాది లక్షణములు జీవాత్మ కంటవు.

మూకుడులోని నీరు కదలుటవలన అందలి సూర్యుడు కూడ కదలి నట్లుండును. అట్లే బుద్ధి కర్తృత్వ భోక్తృత్వ దుఃఖిత్వాది వికారములను గల్గియున్నందున అందు ప్రతిబింబించిన జీవాత్మకా వికారము లున్నట్లు కన్పట్టును.

మూకుదు లోని నీటిని తీసివేయగా నందలి సూర్యుడు నశించి నట్లు కన్పట్టును. అట్లే బుద్ధి నిద్రావస్థలో లయమైనపుడు అందలి జీవుడు కూడ లయమైనట్లు కన్పట్టును.

జలస్థార్కం జలం చోర్మిం
భాసయన్ భాతి భాస్కరః,
ఆత్మభాసం ధియం బుద్ధేః
కర్తృత్వాదీ నయం తథా. 60

మేఘావభాసకో భాను
ర్మేఘచ్ఛన్నోఽపి భాసతే,
మోహావభాసక స్తద్వ
న్మోహచ్ఛన్నోఽపి భాత్యయమ్. 61

జలసూర్యుని, జలమును, తరంగమును కూడ సూర్యుడే ప్రకాశింప చేయుచున్నాడు. అట్లే ప్రతిబింబమైన చిదాభాసుని, బుద్ధిని అందలి కర్తృత్వాదులను కూడ ఆత్మయే ప్రకాశింప జేయుచున్నది.

మేఘమును ప్రకాశింప చేయుచున్నవాడు సూర్యుడు. ఆతడు మేఘముచే కప్పబడి యుండియు నా మేఘమునే ప్రకాశింప చేయును. తానును ప్రకాశించును. అట్లే యాత్మయు అజ్ఞానముచే కప్పబడి యుండియు నా యాజ్ఞానమునను ప్రకాశింపచేయును; తానును ప్రకాశించును.

అధ్యస్తో రజ్జుసర్పోఽయం
సత్యవ ద్రజ్జుసత్తయా,
తథా జగ దిదం భాతి
సత్యవ త్స్వాత్మసత్తయా. 69

అధ్యస్తాహే రభావేన
రజ్జురేవాఽవశిష్యతే.,
తథా జగదభావేన
సదాత్మై వాఽవశిష్యతే. 70

త్రాటినిచూచి పామని భ్రాంతి పడిన వానికి, పాము సత్య మనిపించుటకు కారణము రజ్జువుయొక్క యునికియే. త్రాడే లేనిచో సర్పమను భ్రాంతియే లేదు. అట్లే ఆత్మయే లేనిచో నజ్ఞానికి జగత్సత్యత్వ భ్రాంతియే యుండదు. కావున జ్ఞానమును బట్టియే కాక భ్రాంతిని బట్టి కూడ ఆత్మ సత్యత్వము స్పష్టము.

భ్రాంతి తొలగి యిది త్రాడని తెలియుట తోడనే, పాము పోయి త్రాడే మిగులును. అట్లే జ్ఞానము వలన జగన్మిథ్యాత్వము గ్రహింప బడుట తోడనే, కేవలము ఆత్మయే నిలుచును.

క్షీరయోగా ద్యథా నీరం
క్షీరవ ద్దృశ్యతే మృషా,

ఆత్మయోగా దనాత్మా ఽయ
మాత్మవద్దృశ్యతే తథా. 76

నీరాత్క్షీరం పృథక్కృత్య
హంసో భవతి నాన్యథా,
స్థూలాదేః స్వం పృథక్కృత్య
ముక్తో భవతి నాన్యథా. 77

క్షీరనీర వివేకజ్ఞో
హంస ఏవ న చేతరః,
ఆత్మానాత్మ వివేకజ్ఞో
యతిరేవ న చేతరః. 78

పాలతో కలియుట వలన నీరు కూడ పాలవలె కన్పట్టును. కాని సత్యముగా పాలుగాదు. ఆత్మతో చేరియుండుట వలన దేహాదు లాత్మవలె కన్పట్టును - దేహాదులే తానని మానవుడు భావించును. కాని దేహాదులు సత్యముగా ఆత్మ కాదు.

నీటినుండి పాలను వేరుచేయ గల్గినదే హంస. దేహాదులనుండి తను వేరు చేసికొనగల్గిన వాడే ముక్తుడు; ఇతరుడు కాదు.

నీరక్షీర వివేకము కలది హంసయే కాని మరొకటి కాదు. ఆత్మానాత్మ వివేకము కలవాడు సంన్యాసియే కాని మరొకడు కాదు.

# వాణీకదంబకము

సంస్కృత వాఙ్మయములోని మహాభారతాది వివిధ గ్రంథముల నుండి గ్రహింపబడినవి.

1

పదయం హృదయం యస్య
భాషితం సత్యభూషితమ్,
కాయః పరహితే యస్య
కలిస్తస్య కరోతి కిమ్?

ఎవని హృదయము దయాసహితమో, ఎవని మాట సత్యభూషితమో, ఎవని శరీరము పరులకు హితము చేయుటలో వినియోగింప బడునో వానిని కలికాల మేమి చేయ గలదు?

పరోపకారాయ వహన్తి నిమ్నగాః
పరోపకారాయ దుహన్తి ధేనవః,
పరోపకారాయ ఫలన్తి భూరుహాః
పరోపకారాయ సతాం విభూతయః.

పరోపకారము కొఱకు నదులు ప్రవహించుచున్నవి. పరోపకారము కొఱకు ఆవులు క్షీరమును స్రవించుచున్నవి. పరోపకారముకొఱకు చెట్లు ఫలించుచున్నవి. పరోపకారముకొఱకు సత్పురుషుల యైశ్వర్యము లున్నవి.

ధత్తే భరం కుసుమ పత్ర ఫలావలీనాం
ఘర్మవ్యథాం వహతి శీతభవాం రుజం చ,
యో దేహ మర్పయతి చాన్యసుఖస్య హేతోః
తస్మై వదాన్యగురవే తరవే నమోఽస్తు.

వృక్షము పుష్ప పత్రఫలముల బరువును వహించు చున్నది, శీతోష్ణ బాధలను సహించుచున్నది. ఇతరులకు ఛాయా ఫలాదుల నొసగుటకై తన దేహము నర్పించుచున్నది. వితరణశీలుర కెల్లరకు గురు వన దగిన యా వృక్షమునకు నా నమస్కారములు.

ఆశ్వాస్య పర్వతకులం తపనోష్మతప్తం
ఉద్దామదావ విధురాణి చ కాననాని,

నానానదీ నదశతాని చ పూరయిత్వా
రిక్తోఽపి య జ్జలద సైవ తవోత్తమా శ్రీః.

ఓ మేఘుడా, నీదే యుత్తమైశ్వర్యము. సూర్యరశ్మికి తపించి పోయిన పర్వతముల నోదార్చుచున్నావు. తీవ్ర దావాగ్నిచే దహింప బడుచున్న యర ణ్యములను చల్లార్చుచున్నావు. నదీనద శతములను నీటితో నింపుచున్నావు. నీ జలసంపద నట్లు వినియోగించుచు చివర కకించనుడ వగుచున్నావు.

ప్రియ వాక్య ప్రదానేన
సర్వే తుష్యన్తి జన్తవః,
తస్మాత్తదేవ వక్తవ్యం
వచనే కా దరిద్రతా?

ప్రియముగా పల్కుట వలన సర్వ ప్రాణులు సంతోషించును. కావున సత్యవ్యతిరిక్తముకాని ప్రియవాక్కునే పల్కుచుండవలయును. మాటలలో దారిద్ర్యమేల?

చతుస్సాగర పర్యన్తాం
యో దద్యా ద్వసుధా మిమామ్,
య శ్చాఽభయం చ భూతేభ్య
స్తయో రభయదోఽధికః.

ఎవడు చతుస్సముద్ర ముద్రిత ధరాతలమును దానము చేయుచు న్నాడో, యెవడు సర్వప్రాణులకు అభయ మిచ్చుచున్నాడో, యీ యిద్దరిలోను అభయదానము చేసినవాడే గొప్పవాడు.

న్యగ్రోధస్య యథా బీజం
స్తోకం సుక్షేత్ర భూమిగమ్,
బహు విస్తీర్ణతాం యాతి
తద్వద్దానం సుపాత్రగమ్.

చిన్న మఱ్ఱి విత్తనము సుక్షేత్రమున పడి మొలచి పెద్ద చెట్టయి మిక్కి లిగా విస్తరించునట్లు సత్పాత్ర దానము బహు గుణితముగా పుణ్యప్రద మగును.

ప్రథమ వయసి పీతం తోయ మల్పం స్మరన్తః
శిరసి విహితభారా నారికేళా నరాణామ్,
సలిల మమృత కల్పం దద్యు రాజీవితాన్తం
న హి కృత ముపకారం సాధవో విస్మరన్తి.

చిన్నప్పుడు కొబ్బరిచెట్లు నరులు పోసిన నీటిని త్రాగి బ్రతుకును. దానికి కృతజ్ఞతను తెలుపుటకై యవి జీవితాంతము కూడ నెత్తిమీద కొబ్బరి కాయల బరువును మోసి యమృతమువంటి నీటిని వారి కిచ్చు చుండును. మంచి వారు తమ కితరులు చేసిన యుపకారమును మరవి పోరు గదా!

ఉపకృతి సాహసికతయా
క్షతి మపి గణయన్తి నో గుణినః,
జనయన్తి హి ప్రకాశం
దీపశిఖాః స్వాంగదాహేన.

సత్పురుషులు పరోపకారమందలి సాహస బుద్ధిచేత, తమకు గల్గు నష్టమును కూడ గణింపరు. తమ శరీరమును తగుల బెట్టుకొనుచునే కదా దీపశిఖలు లోకమునకు కాంతి నొసగుచున్నవి.

అహో మహత్త్వం మహతా మపూర్వం
విపత్తికాలేఽపి పరోపకారః,
యదాఽస్య దేశే పతితోఽపి రాహోః
కలానిధిః పుణ్యచయం దదాతి.

ఆహా, మహానుభావులు తమ కాపత్తు గల్గినపుడు కూడ నితరులకు పుణ్యమును గల్గించుచుందురు. రాహువు నోట బడినప్పుడు కూడ చంద్రు డితరులకు పుణ్యమును గల్గించుచున్నాడు. గ్రహణ సమయమున ప్రజలు స్నాన దానాదులచే పుణ్యము సంపాదించుకొనుచున్నారు కదా!

యాచమాన జనమానస వృత్తేః
పూరణాయ బత జన్మ న యస్య,
తేన భూమి రతిభారవతీయం
న ద్రుమై ర్న గిరిభి ర్న సముద్రైః.

యాచకజనుల కోరికల నెన్నడును తీర్చని వారే యీ భూమికి బరువుగా నున్నారు. చెట్లను, పర్వతములను సముద్రములను ఈ పృథివి తేలికగానే మోయగలదు.

మధుర మివ వదన్తి స్వాగతం భృంగనాదైః
నతిమివ ఫలనమ్రైః కుర్వతేఽమీ శిరోభిః,
నను దదత ఇవార్ఘ్యం పుష్పవృష్టిం కిరన్తః
కథ మతిథిసపర్యాం శిక్షితా శ్శాఖినోఽపి.

ఆహా, యీ వనములోని వృక్షములు కూడ నిటకు వచ్చిన యతిథులకు చక్కని యాతిథ్యమిచ్చుచున్నవే. పుష్పవాసనలను గ్రోలుటకు వచ్చిన తుమ్మెదల ధ్వనులే స్వాగతవచనములుగా వినబడుచున్నవి. ఫలముల భారముచే వంగినవై యీ చెట్లు అతిథులకు నమస్కరించు చున్నట్లున్నవి. పుష్పవృష్టిని గురిపించుచు అర్ఘ్యమిచ్చుచున్నవా యన్నట్లున్నవి ఏమి యాశ్చర్యము! ఇచటి వృక్షములు కూడ అతిథి పూజా విషయమున చక్కని శిక్షణము నొందియున్నవి.

మూలం భుజంగై శ్శిఖరం విహంగై
శ్శాఖాః ప్లవంగైః కుసుమాని భృంగైః,
సంసేవ్యతే చందనపాదపోఽయం
పరోపకారాయ సతాం ప్రవృత్తిః.

చందనవృక్షముయొక్క మొదలు పాములచే నాశ్రయింపబడును. శిఖరము పక్షులచే నాశ్రయింపబడును. కొమ్మలు కోతులచేతను, పుష్పములు తుమ్మెదలచేతను ఆశ్రయింపబడును. పరోపకారమే మంచి వారి ప్రవృత్తి కదా!

రత్నాకరః కిం కురుతే స్వరత్నై
ర్విన్ధ్యాచలః కిం కరిభిః కరోతి,
శ్రీఖండ ఖండై ర్మలయాచలః కిం
పరోపకారాయ సతాం విభూతయః.

రత్నములు సముద్రములో పుట్టును. కాని సముద్రుడు వానిని వాడుకొనక యితరులకిచ్చుచున్నాడు. ఏనుగులు వింధ్యాద్రిలో జన్మించుచున్నవి. కాని వింధ్యాద్రి వాని నుపయోగించుకొనక యితరులకే విడచుచున్నది. మంచి గంధపుచెట్లు మలయపర్వతములో పుట్టు చున్నవి. వాని నా పర్వతము వాడుకొనక పరులకు వదలు చున్నది. సత్పురుషుల యైశ్వర్యములు పరోపకారముకొఱకే కదా!

---

**2**

లుబ్ధస్య నశ్యతి యశః పిశునస్య మైత్రీ
నష్టక్రియస్య కుల మర్థపరస్య ధర్మః,
విద్యాఫలం వ్యసనినః కృపణస్య సౌఖ్యం
రాజ్యం ప్రమత్తసచివస్య నరాధిపస్య.

లుబ్ధత్వము కీర్తిని పోగొట్టును. ఉన్నదోషములనో లేనిదోషములనో యితరులకు వెల్లడించుట స్నేహమును చెడగొట్టును. కర్మభ్రష్టత్వము కులమును చెడగొట్టును. ధనతృష్ణ ధర్మమును చెడగొట్టును. దుర్వ్యసనము విద్యను వ్యర్థము చేయును. పీనాసితనము సౌఖ్యమును పోగొట్టును. అవివేకియైన మంత్రి, రాజు రాజ్యమును పోగొట్టును.

కలహాన్తాని హర్మ్యాణి
కువాక్యాంతం చ సౌహృదమ్,
కురాజాన్తాని రాష్ట్రాణి
కుకర్మాంతం యశో నృణామ్.

ఇంటిలోని వారికి అంతఃకలహము పుట్టనంత కాలమే, యిల్లు ఇల్లనిపించుకొనును. మాట మాట యనుకోనంత కాలము మాత్రమే స్నేహము నిలచియుండును. దుష్టుడు రాజుగా రానంత కాలమే, రాజ్యము నిలచి యుండును. చెడ్డపని చేయనంత కాలము మాత్రమే నరుని కీర్తి నిలచి యుండును.

ద్యూతా ద్ధర్మసుతః పలాదిహ బకో
మద్యా ద్యదోర్నందనాః
శక్రో జారతయా మృగాన్తకతయా
స బ్రహ్మదత్తో నృపః,
చోరత్వాచ్చ యయాతి రన్యవనితా
సంగా ద్దశాస్యో మహా
నేకైక వ్యసనార్జితా యత ఇమే
సర్వైర్న కో నశ్యతి?

జూదము వలన ధర్మరాజు చెడిపోయెను. మాంసభక్షణము వలన బకాసురుడు నశించెను. మద్యపానము వలన యాదవులు నశించిరి. దేవేం

ద్రుడు జారత్వము వలన నష్ట పడెను. బ్రహ్మదత్తుడను రాజు వేటవలన చెడెను. యయాతి చౌర్యము వలన భ్రష్టత నొందెను. రావణుడు పరస్త్రీ వ్యామోహము వలన నశించెను. ఒక్కొక్క వ్యసన ముండుట వలననే వీరెల్లరు చెడిపోయిరి. ఇన్ని వ్యసనములను కూడ కల్గిన వాడు నశించుటలో నాశ్చర్య మే మున్నది?

అకర్మ శీలం చ మహాశనం చ
మాయావినం లోక విరుద్ధవృత్తమ్,
అదేశ కాలజ్ఞ మనిష్ట వేష
మేతాన్ గృహే న ప్రతివాసయేత.

సోమరిని, తిండిపోతును, లోకవిరుద్ధవర్తనుని, మాయావిని, క్రూరుని, దేశ కాలజ్ఞానము లేనివానిని, అనిష్టమైన వేషము గల వానిని - వీరి నెవ్వడును గృహమం దుంచుకొనరాదు.

అతి దానా ద్బలి ర్బద్ధో
హ్యతిమానా త్సుయోధనః,
వినష్టో రావణో లౌల్యా
దతి సర్వత్ర వర్జయేత్.

మితిమీరిదానము వలన బలిచక్రవర్తికి బంధము కల్గినది. అతి స్వాభిమానము వలన దుర్యోధనుడు చెడిపోయెను. అతిలోలత్వము వలన రావణుడు నశించెను. కావున నే విషయములోను కూడ అతి పనికిరాదు.

విద్యా వివాదాయ ధనం మదాయ
శక్తిః పరేషాం ఖలు పీడనాయ,
ఖలస్య సాధో ర్విపరీత మేతత్
జ్ఞానాయ దానాయ చ రక్షణాయ.

దుర్మార్గునకు విద్య వివాదముకొఱకే యుపయోగపడును; ధనము మదమునకే కారణ మగును. శక్తి పరపీడనముకొఱకే యగును. సత్పురుషున కీ మూడును మరొక విధముగా నుపయోగపడును. ఆతనికి విద్యవలన జ్ఞానము గల్గును; ధనము వలన దాతృత్వము గల్గును. శక్తివలన లోకరక్షకత్వము గల్గును.

న ధనం నచ రాజ్యసంపదం
నహి విద్యా మిద మేక మర్థయే,
మయి దేహి మనాగపి ప్రభో
కరుణాభంగి తరంగితాం దృశమ్.

ఓ ప్రభూ, నేను కోరునది ధనము కాదు. రాజ్య సంపద కాదు, విద్య కాదు, కరుణా తరంగితమైన నీ దృష్టిని, కొంచెమైనను నాపై నుంచుము.

వేదశాస్త్ర పురాణేన
కాలో గచ్ఛతి ధీమతాం,
వ్యసనేన చ మూర్ఖాణాం
నిద్రయా కలహేన వా.

వేదశాస్త్ర, పురాణపఠన, విచారణములలో బుద్ధిమంతులకు కాలము గడచును. మూర్ఖుల కన్ననోదుర్వ్యసనములలోను, నిద్రలోను, పోట్లాటల లోను కాలముగడచును.

అసారే ఖలు సంసారే
సార మేత చ్చతుష్టయమ్,
కాశ్యాం వాసః సతాం సంగో
గంగాంభః శంభుసేవనమ్.

సారరహితమైన యీ సంసార మందు ఈ నాలుగే సారభూత మయి నవి: (1) కాశీ వాసము (2) సత్సహ వాసము (3) గంగోదక సేవనము (4) పరమేశ్వరసేవనము.

ఏకః స్వాదు న భుంజీత
ఏక శ్చార్థా న్న చింతయేత్,
ఏకో న గచ్ఛే దధ్వానం
నైకః సుప్తేషు జాగృయాత్.

మధుర పదార్థమును ఇతరులకు పెట్టకుండ తినరాదు, ముఖ్య విష యములలో నితరుల యభిప్రాయములను తీసికొన వలయునే కాని తానొక్కడే యాలోచింపరాదు. ఒక్కడు దారిని పోరాదు. ఇతరులు నిద్రింపగా తానొక్కడును మేల్కొని యుండరాదు.

అర్థనాశం మనస్తాపం
గృహే దుశ్చరితాని చ,
వంచనం చాఽపమానం చ
మతిమాన్న ప్రకాశయేత్.

తనకు ధనహాని గల్గుచో నితరులకు చెప్పకూడదు. మనస్సులో నున్న బాధలను కూడ చెప్పరాదు. తన యింట అకృత్యములు జరుగుచో వానిని వెల్లడించరాదు. తన్నెవరైనను మోసముచేయుచో దానిని వెల్లడించరాదు. తనకు గల్గిన యవమానమును కూడ నితరులకు తెలుపరాదు.

కో లాభో గుణిసంగమః కి మసుఖం ప్రాజ్ఞేతరై స్సంగతిః
కా హానిః సమయచ్యుతిః నిపుణతా కా ధర్మతత్త్వే రతిః,
క శ్శూరో విజితేంద్రియః ప్రియతమా కాఽనువ్రతా కిం ధనం
విద్యా కిం సుఖ మప్రవాస గమనం రాజ్యం కి మాజ్ఞాఫలమ్.

ఏది లాభము? సత్పురుషుల సాంగత్యమే లాభము. ఏది దుఃఖము? మూర్ఖసహవాసమే దుఃఖము. ఏది హాని? ఇతరులతో చేసికొన్న యేర్పాటు తప్పుటయే హాని. ఏది నైపుణ్యము? స్వధర్మాను రక్తియే నైపుణ్యము. ఎవడు శూరుడు? ఇంద్రియములను జయించిన వాడే శూరుడు. ఎవతె ప్రియురాలు? తన్ననుసరించిన వ్రతముగలదే ప్రియురాలు. ఏది ధనము? విద్యయే ధనము. ఏది సుఖము? ప్రవాసమునకేగక యింటనుండుటయే సుఖము. ఏది రాజ్యము? తన మాట చెల్లుబడియగుటే రాజ్యము.

గుణదోషౌ బుధో గృహ్ణ
న్నిందుక్ష్వేడా వివేశ్వరః,
శిరసా శ్లాఘతే పూర్వం
పరం కంఠే నియచ్ఛతి.

శివుడు విషమును కంఠములో నుంచుకొని చంద్రుని శిరస్సుపై నిడి కొనినట్లు పండితుడు పరుని దోషములను తనలోనే యుంచుకొని మంచి గుణములను నెత్తిన పెట్టుకొని పూజించును (శ్లాఘించును).

సతాం ధనం సాధుభి రేవ భుజ్యతే
దురాత్మభి ర్దుశ్చరితాత్మనాం ధనమ్,

శుకాదయ శ్చూతఫలాని భుంజతే
భవంతి నింబాః ఖలు కాకభోజనాః.

మంచివారి ధనము సత్పురుషులచేతనే యనుభవింపబడును. దురాత్ముల ధనము దుశ్చరితులచేతనే యనుభవింపబడును. మామిడి పండ్లను చిలుకలు తినును. వేప పండ్లను కాకులు తినును.

సందూషితోఽపి పూర్ణేందో
చక్రవాకై ర్మదోత్కటైః,
కిం చకోరా స్త్వదాయత్తా
న సన్తి పృథివీతలే.

రాత్రి కాల మందు దృష్టిని కోల్పోవు చక్రవాక మిథునములు తమ సహచరులను కూడుటకు చంద్రు డడ్డు వచ్చుచున్నా డని తలచి చంద్రుని దూషించును. ఓ పూర్ణచంద్రుడా! నీవు ఆ మదాంధుల నిందలను లెక్క చేయవద్దు. దీనములైన చకోర పక్షులు నీ వెన్నెలను త్రాగి బ్రదుకుచు నిన్ను ప్రశంసించుచున్నవి. (దీన జనోద్ధరణము గొప్పసుకృతము. మదాంధుల దూషణమువలన గల్గు హానిలేదు.)

ముక్తాఫల, త్వా మిభకుంభ సంస్థం
పంచాననో ముంచతు మాంసలోభీ,
కిరంతు గుంజాభరణాః కిరాతాః
కిం తేన హీయేత మహార్ఘతా తే?

ఓ ముత్యమా! గజ కుంభ స్థలమును బ్రద్దలు కొట్టిన సింహము మాంసమునే కోరునదై యందున్న నిన్ను విసర్జించుగాక. అట్లే కిరాత స్త్రీలు గురువిందల గింజలనే యాభరణములుగా ధరించి నీ విలువను గ్రహింపజాలక పారవైతురుగాక! అంత మాత్రముచేత నీ విలువ పోయినదా? (ఓ సత్పురుషులారా మిమ్ములను అజ్ఞులైన దుష్టులు నిరసించినను మీ విలువను గ్రహించువారు లోకములో నుండకపోరు.)

మనీషిణ స్సంతి న తే హితైషిణో
హితైషిణ స్సంతి న తే మనీషిణః,
సుహృచ్చ విద్వానపి దుర్లభో నృణాం
యథౌషధం స్వాదు హితం చ దుర్లభమ్.

బుద్ధిమంతులు కలరు కాని, వారు నీ హితమును కోరక పోవచ్చును. నీ హితమును కోరువారందరు బుద్ధిమంతులు కాక పోవచ్చును. పాండిత్యముతో కూడిన స్నేహితుడు లభించుట యరుదు. తియ్యగా నుండి రోగము కుదుర్చు మందు అరుదు కదా.

ఇహ తురగశతైః ప్రయాన్తు మూఢా
ధనరహితాస్తు బుధాః ప్రయాన్తు పద్భ్యామ్,
గిరిశిఖర గతాఽపి కాకపంక్తిః
పులినగతై ర్న సమత్వ మేతి హంసైః.

ఈలోకములో మూఢులు గుఱ్ఱములపై తిరుగ వచ్చును. ధన రహితులైన పండితులు పాదచారులు గానే యుండవచ్చును. కాకులు పర్వత శిఖరముమీద కూర్చుండ వచ్చును. హంసలు క్రింద ఇసుక తిన్నెలపై నుండ వచ్చును. మానవుల విలువలు వారారోహించు వాహనములను బట్టి యుండవు.

సానందం సదనం సుతాశ్చ సుధియః కాన్తా న దుర్భాషిణీ
సన్మిత్రం సుధనం స్వయోషితిరతి శ్చాజ్ఞాపరాస్సేవకాః,
ఆతి థ్యం శివపూజనం ప్రతిదినం మృష్టాన్నపానం గృహే
సాధోస్సంగ ముపాసతే హి సతతం ధన్యో గృహస్థాశ్రమః.

ఇంటిలో నెల్లరు నెల్లప్పుడు ఆనందముగా నుండుట, కుమారులు బుద్ధిమంతులై యుండుట, భార్య దుర్భాషలను పల్కునదిగా కాక ప్రియభాషిణిగా నుండుట, మంచిస్నేహితుడు లభించుట, ధనమునకు లోటులేకుండుట, తన భార్య యందు తనకు ప్రీతియుండుట, సేవకులు చెప్పినట్లు వినుట, నిత్యము ఇంటికి వచ్చిన వారికి యాతిథ్య మిచ్చుట, పరమేశ్వరు పూజ, మృష్టాన్న పానములు; సాధుసాంగత్యము - వీనితో కూడిన గృహస్థాశ్రమము ధన్యమైనది.

దోషా గుణాయ గుణినాం
మహదపి దోషాయ దోషిణాం సుకృతమ్,
తృణ మివ దుగ్ధాయ గవాం
దుగ్ధ మివ విషాయ సర్పాణామ్.

గుణవంతులు దోషమును కూడ గుణముగానే గ్రహింతురు. దోషులు గుణమును గూడ దోషముగానే గ్రహింతురు. గోవులు గడ్డితిని కూడ

దానిని పాలనుగా మార్చుకొనును. సర్పములు పాలు త్రాగియు దానిని విషముగా మార్చుకొనును.

దోషభావ మవధీర్య మానసే
ధారయన్తి గుణ మేవ సజ్జనాః,
క్షారభావ మపనీయ గృహ్ణతే
వారిధేః సలిల మేవ వారిదాః.

చెడ్డను విడచి మంచిని గ్రహించుటే సత్పురుషుల లక్షణము. మేఘములు సముద్రపు నీటిని లాగుకొనినపుడు, వాని యందలి క్షారగుణమును విడచి స్వాదుత్వమునే తీసికొనుచున్నవి కదా.

సుభాషితైః ప్రీతి రనున్నతిః శ్రియాః
పరార్థ నిష్పత్తి పటీయసీ క్రియా,
గుణే ష్వతృప్తిర్గుణవత్సు చాదరో
విగూఢ మేతచ్చరితం మహాత్మనామ్.

సుభాషితములచే సంతోషించుట, ధనముచే గర్వింపకుండుట, పరోపకార పరాయణత, తమకున్న సద్గుణములచే సంతృప్తి చెందక వానిని వృద్ధి చేసికొనుట, గుణవంతుల నాదరించుట అను గుణములను మహాత్ములు కల్గియుందురు.

---

### 3

ఆదౌ చిత్తే తతః కాయే
సతాం సంపద్యతే జరా,
అసతాం తు పునః కాయే
నైవ చిత్తే కదాచన.

సత్పురుషులకు ముందు మనస్సులో, తర్వాత శరీరము మీదను వార్ధకము కన్పట్టును. చెడ్డవారికి శరీరము మీదనే కాని, మనసులో నెన్నడును వృద్ధత్వము కన్పట్టదు.

పూర్వే వయపి యః శాంతః
స శాన్త ఇతి మే మతిః,
ధాతుషు క్షీయమాణేషు
శమః కస్య న జాయతే?

ఎవడు యౌవనములో శాంతుడుగా నుండునో వాడే శాంతుడని నా యభిప్రాయము. ధాతువులు క్షీణించి పోవుచుండగా నరుడు శాంతుడు కాకేమగును? వార్ధకములోని శాంతత్వ మొక శాంతత్వము కాదు.

సర్పాణాం చ ఖలానాం చ
సర్వేషాం దుష్టచేతసామ్,
అభిప్రాయా న సిద్ధ్యంతి
తే నేదం వర్తతే జగత్.

పాములయొక్కయు, దుర్మార్గులయొక్కయు సంకల్పములు నెఱవేరుట లేదు. కావుననే ప్రపంచ మింకను నిలచి యున్నది. (వారెంత దుష్టులైనను జగన్నియామకుడు వేరుగా నున్నందున జగత్తు నిలచియున్నది.)

చంపకేషు సువర్ణత్వం
కాంతి ర్ముక్తాఫలేషు చ,
యథేక్షుదండే మాధుర్య
మౌదార్యం సహజం తథా.

సంపెంగ పూలయందు బంగారు రంగు, ముత్యములయందు కాంతి, చెఱకు కఱ్ఱలో తీపి యెట్లు సహజములో యట్లే కొంతమంది జనులలో నౌదార్యము సహజముగానే యుండును.

పదే పదే చ రత్నాని
యోజనే రసకూపికా,
భాగ్యహీనా న పశ్యన్తి
బహురత్నా వసుంధరా.

మనకు కన్పట్టుట లేదు కాని, కొన్ని పట్ల భూభాగమున, అడుగడుగునకు రత్నము లుండును. కాని పైనే మనము నడచుచున్నాము. యోజనమున కొక రసకూప ముండవచ్చును. భాగ్యహీనుల కది కనబడనంత మాత్రమున వసుంధర రత్నగర్భ కాకపోవునా?

అమంత్ర మక్షరం నాస్తి
నాస్తిమూల మనౌషధమ్,
అయోగ్యః పురుషో నాస్తి
యోజక స్తత్ర దుర్లభః.

మనము తెలిసికొనజాలము కాని, మంత్రముగా నుపయోగింపని యక్షరము లేదు. మందుగా నుపయోగింపని దుంప యుండదు. ఎందుకును పనికిరాని మనుష్యు డుండడు. సరిగా నుపయోగించు వారు మాత్రము అరుదు.

దాతృత్వం ప్రియవక్తృత్వం
ధీరత్వ ముచితజ్ఞతా,
అభ్యాసేన న లభ్యంతే
చత్వార స్సహజా గుణాః.

దానశీలము, ప్రియభాషణము, ధీరత్వము, ఔచిత్యము - ఈ నాల్గును నేర్చుకొనిన వచ్చు లక్షణములు కావు. పుట్టుకతోనే రాదగినవి.

---

4

ఉత్సవే వ్యసనే ప్రాప్తే
దుర్భిక్షే శత్రుసంకటే,
రాజద్వారే శ్మశానే చ
య స్తిష్ఠతి స బాంధవః.

శుభసమయములోను, ఆపత్తులోను, దారిద్ర్యము లోను, శత్రు భయము గల్గినప్పుడును, రాజద్వార మందును, శ్మశాన మందును ఎవడు కూడ నుండునో వాడే బంధువు.

గిరౌ మయూరో గగనే చ మేఘో
లక్షాంతరేఽర్కః సలిలే చ పద్మమ్,
లక్షద్వయే గ్లౌః కుముదాని భూమౌ
యయోస్తు మైత్రీ న తయోర్హి దూరమ్.

గిరిపైన నెమలి యున్నది. ఎక్కడనో గగనమందు మేఘమున్నది. అయినను మేఘమును చూచి నెమలి నాట్యము చేయును.

పద్మములు సరస్సులో నున్నవి. సూర్యుడు లక్ష యోజనముల దూరమున నున్నాడు. అయినను సూర్యుని చూచి పద్మములు వికసించుచున్నవి. కలువలు భూలోకమున నున్నవి. చంద్రుడు రెండు లక్షల యోజనముల దూరమున నున్నాడు. అయినను చంద్రుని చూచి కలువలు వికసించుచున్నవి. మైత్రికి దూర మడ్డురాదు కదా!

దదాతి ప్రతిగృహ్ణాతి
గుహ్యామాఖ్యాతి పృచ్ఛతి,
భుంక్తే భోజయతే చైవ
షడ్విధం ప్రీతిలక్షణమ్.

ఇచ్చుట, పుచ్చుకొనుట, రహస్యములను చెప్పుట, అడిగి తెలిసికొనుట, భుజించుట, భుజింప చేయుట - ఇవి ప్రేమకు లక్షణములు.

విద్యా మిత్రం ప్రవాసేషు
భార్యా మిత్రం గృహేషు చ,
వ్యాధిత స్యౌషధం మిత్రం
ధర్మో మిత్రం మృతస్య చ.

ప్రవాస సమయమున విద్యయే మిత్రము, గృహమున భార్యయే మిత్రము, వ్యాధితునకు ఔషధమే మిత్రము! మృతునకు ధర్మమే మిత్రము.

శర్వరీదీపక శ్చంద్రః
ప్రభాతోద్దీపకో రవిః,
త్రైలోక్యదీపకో ధర్మః
సుపుత్రః కులదీపకః.

చంద్రుడు రాత్రిని ప్రకాశింపచేయును. సూర్యుడు పగటిని ప్రకాశింపజేయును. ధర్మము త్రిలోకములను ప్రకాశింపచేయును. సుపుత్రుడు కులమును ప్రకాశింపజేయును.

అద్వైతం సుఖదుఃఖయో రనుగతం సర్వా స్వవస్థాసు య
ద్విశ్రామో హృదయస్య యత్ర జరసా యస్మిన్నహార్యో రసః,
కాలేనా౽వరణాత్యయాత్పరిణతే యత్ప్రేమసారే స్థితం
భద్రం తస్య సుమానుషస్య కథ మప్యేకం హి తత్ప్రార్థ్యతే.

దాంపత్య ప్రేమ మహోత్కృష్ట మయినది కదా! అది సుఖసమయ ములో నుండి దుఃఖసమయములో పోవునది కాదు. సర్వావస్థలయందు నొకే రీతిగా సాగుచుండును. స్త్రీపురుషుల హృదయములకు యథార్థమైన విశ్రాంతి దాంపత్యప్రేమలోనే యున్నది. వార్ధకము వచ్చినను ఈ ప్రేమరస ము తరుగదు. ఇతర ప్రేమ వలె నిది హద్దు కలది కాదు; అది యెల్లప్పుడు జీవితాంతము వృద్ధి నొందుచునే యుండును. అట్టి దాంపత్య జీవితమునకు విఘాతము కలుగ కూడదని మాత్రము ప్రార్థించు కొనవలసియున్నది.

ఆనంద మృగ దావాగ్నిః
శీల శాఖి మదద్విపః,
జ్ఞానదీప మహావాయు
రయం ఖలసమాగమః.

దావాగ్ని అడవి జంతువులకు విపత్తును తెచ్చునట్లు దుష్టుల సహవా సము సజ్జనుల యానందమునకు భంగము గల్గించును. మదపు టేనుగు చెట్లను విరచివైచునట్లు దుష్ట సహవాసము మంచివారి శీలమును చెడగొ ట్టును. మరియు వాయువు దీపము నార్పివైచునట్లు జ్ఞానమును పోగొట్టును.

యశస్సౌరభ్య లశునః
శాంతి శైత్య హుతాశనః,
కారుణ్య కుసుమాకాశః
ఖల స్సజ్జన దుఃఖదః.

దుర్మార్గుడు సజ్జనుల సుగుణములను రాణింపునకు రానీయడు. ఇతర వస్తువుల పరిమళమును ఉల్లి చెరచునట్లు వాడు వారి కీర్తిని చెడగొట్టును. అట్లే వాడు వారి శాంతి శైత్యమునకు అగ్నివంటి వాడు. వారి సహజ కారుణ్యము కూడ ప్రసరింపకుండునట్లు వాడు ప్రవర్తించి యాకారుణ్య కుసుమమును నిరాధారము చేయును.

లబ్ధోదయోఽపి ఖలః
ప్రథమం స్వజనం నయతి సుపరితాపమ్,
ఉద్గచ్ఛన్ దవదహనో
జన్మభువం దారు విర్దహతి.

దుర్మార్గుడు వృద్ధిలోనికి వచ్చుచో స్వజనమునకే యపకారము చేయును. దావాగ్ని విజృంభించుచున్నదై ముందు తనకు జన్మస్థానమైన కఱ్ఱను తగులబెట్టును.

---

5

మహాశయ్యా భూమి ర్విపులముపధానం భుజలతా
వితానం చాకాశం వ్యజన మనుకూలోఽయమనిలః,
స్ఫుర ద్దీపశ్చంద్రః స్వధృతివనితా సంగముదితః
సుఖం శాన్త శ్శేతే విగతభయభీతి ర్నృప ఇవ.

ఈ వానప్రస్థునకు భూమియే శయ్య. భుజమే దిండు. ఆకాశమే చాందిని. అనుకూల వాయువే విసనకఱ్ఱ. చంద్రుడే దీపము. ఆత్మ సంతుష్టియే వనితా సంగమము. ఈతడు భయరహితుడైన మహారాజువలె సుఖముగా శాంతముగా శయనించుచున్నాడు గదా!

కదా బృందారణ్యే విమల యమునాతీర పులినే
చరన్తం గోవిందం హలధర సుదామాది సహితమ్,
అయే కృష్ణస్వామిన్ మధురమురళీ వాదనవిభో
ప్రసీదేత్యాక్రోశ న్నిమిష మివ నేష్యామి దివసాన్.

బృందావనములో విమల యమునాతీరమున సుదామ బలరామాది సహితుడై సంచరించు గోవిందుని "ఓ కృష్ణ ప్రభూ, మధుర మురళీ వాదన విభూ! అనుగ్రహించుము" అని విలపించుచు దినముల నొక నిమిషముగా నే నెప్పుడు గడపుదునో కదా!

కృత్వా దీనవిపీడనాం విజజనే బద్ధ్వా వచో విగ్రహం
నైవాలోచ్య గరీయసీ రపి చిరా దాముష్మికీ ర్యాతనాః,
ద్రవ్యౌఘాః పరిసంచితాః ఖలు మయా యస్యాః కృతే సాంప్రతం
నీవారాంజలినాఽపి కేవల మహో సేయం కృతార్థా తనుః.

దీనులను పీడించి, స్వజనముతో విరోధము పెట్టుకొని, పరలోకములో పడవలసిన యాతనలనుగూర్చి కూడ నాలోచింపక నాచేత ధనరాసులు సంపాదింపబడినవి. ఏ శరీరమిపుడు నీవారధాన్యాంజలి

చేతనే సంతృప్తి పడుచున్నదో యా శరీరముకొఱకే కదా యట్టి యకృత్యముల వలన నంతగా నార్జనము గావింపబడినది.

యస్మా చ్చ యేన చ యదా చ యథా చ యచ్చ
యావచ్చ యత్ర చ శుభాఽశుభ మాత్మ కర్మ,
తస్మాచ్చ తేన చ తదా చ తథాచ తచ్చ
తావచ్చ తత్ర చ కృతాన్తవశా దుపైతి.

మానవుడు పుణ్య పాప కర్మలను ఎందువలన, దేనిచేత, ఎప్పుడు, ఎట్లు, ఎంతవరకు నెచ్చట నాచరించునో యను వానికి అనుగుణమగు నట్లు ఆ కర్మములను, ఫలమును అనుభవింపవలసి యుండును. ఇది పరమేశ్వరుని యేర్పాటు.

యత్క్షాన్తిః సమయే శ్రుతిఃశివశివేత్యుక్తౌ మనో నిర్వృతి
ర్భైక్షేచాఽభిరుచి ర్ధనేషు విరతిః శశ్వత్సమాధౌ రతిః,
ఏకాన్తే వసతి ర్గురౌ ప్రతినతిః సద్భిః సమం సంగతిః
సత్త్వే ప్రీతి రనంగనిర్జితి రసౌ సన్ముక్తిమార్గే స్థితిః

వికారహేతువు గల సమయమున ఓర్పు, వేదనిరతి; శివశివ యను పలుకులో మనస్తృప్తి; భిక్షాశనమం దభిరుచి; ధనమందు విరక్తి; ఎల్లప్పుడును సమాధి యందాసక్తి, ఏకాంతమందు నివాసము, గురువునందునమ్రభావము, సత్సాంగత్యము; సత్త్వగుణ ప్రీతి, మన్మథ జయము- ఇదియే ముక్తి మార్గము.

రామస్య వ్రజనం బలే ర్నియమనం పాండో స్సుతానాం వనం
వృష్ణీనాం విధనం నలస్య నృపతే రాజ్యా త్పరిభ్రంశనమ్,
నాట్యాచార్యక మర్జునస్య పతనం సంచిత్య లంకేశ్వరే
సర్వం కాలవశాజ్జనోఽత్ర సహతే కః కం పరిత్రాయతే?

శ్రీరాము డంతవానికి ప్రవాసము సంభవించెను. బలిచక్రవర్తి పాతాళమం దణచబడెను. యాదవులకు సంఘమరణము సంభవించెను. నలమహారాజు రాజ్యభ్రష్టు డాయెను. అర్జునునివంటి వీరుడు నాట్యాచార్య వృత్తి నవలంబించెను. రావణునివంటి వాడు పడిపోయెను. ఎల్లరు కాలమునకు వశులు కావలసినదే. ఎవరెవరిని రక్షింపగలరు?

సంపదో మహతామేవ
మహతా మేవ చాపదః,
వర్ధతే క్షీయతే చంద్రో
నతు తారాగణః క్వచిత్.

సంపదలైనను ఆపదలైనను గొప్పవారికే వచ్చును. వృద్ధి క్షయములు చంద్రునకు గలవే గాని నక్షత్రములకు లేవు కదా.

మాపి మాపి సమా జ్యోత్స్నా
పక్షయో రుభయో రపి,
తత్రైకః శుక్లపక్షోఽభూ
ద్యశః పుణ్యై రవాప్యతే.

ప్రతిమాసమునను శుక్లపక్షములోని వెన్నెలయు, కృష్ణపక్షములోని వెన్నెలయు సమానముగానే యుండును. పూర్ణిమ అమావాస్య యను రెండు దినములలోని వెన్నెలను అటుంచినచో మిగిలిన దినములలోని వెన్నెలప్రమాణము రెండు పక్షములలోను సమానముగానే యుండును. అట్లయినను ఒకదానికి శుక్లపక్ష మను పేరు వచ్చినది. అట్లే లోకములో సమానమైన పాండిత్యాది గుణములుగల వారిలో కొందరికి కీర్తివచ్చును; కొందరికి రాదు. పూర్వజన్మలో చేసికొన్న పుణ్యమును బట్టియే కీర్తి వచ్చును కాని యర్హతను బట్టి కాదు.

మాతాపితృ సహస్రాణి
పుత్రదార శతాని చ,
తవాఽనన్తాని యాతాని
కస్య తే కస్య వా భవాన్?

ఇది వఱకు అసంఖ్యాక జన్మములలో నీకు ఎందరో తల్లులు, ఎందరో తండ్రులు, ఎందరో దారాపుత్రులు నుండిరి. వారెవ్వరి వారు? నీ వెవ్వరి వాడవు?

మాతా లక్ష్మీః పితా విష్ణుః
స్వయం చ విషమాయుధః,
తథాపి శంభునా దగ్ధః
ప్రాకృతం కేవ లంఘ్యతే?

మన్మథునకు తల్లి లక్ష్మీదేవి, తండ్రి మహావిష్ణువు వాని యాయుధ ములు విషమములు. (1. ప్రమాదకరములు, 2. బేసిసంఖ్య కలవి.) అట్లయినను నాతడు శివునిచే దహింపబడినాడు. పురాకృత కర్మము నెవడు తప్పించుకొన గలడు?

క్షతే ప్రహారా నిపతం త్య భీక్ష్ణ
మన్నక్షయే వర్ధతి జాఠరాగ్నిః,
ఆపత్సు వైరాణి సముద్భవంతి
వామే విధౌ సర్వమిదం నరాణామ్.

దెబ్బ మీదనే దెబ్బలగులును. అన్నము లేనప్పుడే యాకలి యెక్కు వగును; ఆపత్కాలములలోనే ప్రజలతో విరోధములు వచ్చుచుండును. దినములు బాగుండనపు డంతయు నిట్లుండును.

అహ న్యహని భూతాని
గచ్ఛన్తి యమమందిరమ్,
శేషాః స్థిరత్వ మిచ్ఛతి
కి మాశ్చర్య మతః పరమ్.

ప్రతి దినము ప్రాణులు మృతినొంది యమ మందిరమునకేగు చున్నవి. అట్లైనను కొందరు స్థిరముగా నుండిపోవుటకు కోరుచున్నారు. ఇంత కంటె నాశ్చర్య మేముండును?

నిత్య మాచరతః శౌచం
కుర్వతః పితృతర్పణమ్,
యస్య నోద్విజతే చేతః
శాస్త్రం తస్య కరోతి కిం?

నిత్యము శౌచవిధి నిర్వర్తించు కొనుచు, పితరులకు తర్పణము విడచు వాడు, సంసారమువలన భయపడనిచో వానికి శాస్త్రమేమి యుపకారము చేయగలదు? నిత్యశౌచవిధి వలన నీ దేహము మల మూత్ర నిలయమని తెలిసి దానిపై రోత పుట్టవలయును. ప్రతి దినము పితృ పితామహాదులకు తర్పణము విడుచునప్పుడు తాను కూడ నేనాడో మరణము నొంద వల సియే యున్నదని గుర్తించి వైరాగ్య మార్గమున బడి ఆత్మ కల్యాణమునకై యత్నింప వలయును.

పాషాణఖండే ష్వపి రత్నబుద్ధిః
కాంతేతి ధీః శోణిత మాంసపిండే,
పంచాత్మకే వర్ష్మణి చాత్మభావో
జయ త్యసౌ కాచన మోహలీలా.

ఈ లోకములో అజ్ఞానముయొక్క ప్రభావము ఎక్కువగా నున్నది గదా! లకు ఱాళ్ళ యందు రత్నములనెడి భావము గల్గుచున్నది; రక్త మాంస శమందు కాంతాబుద్ధి గల్గుచున్నది. పంచభూతాత్మకమైన దేహమందు ్మభావము గల్గుచున్నది?

పతితః పశు రపి కూపే నిస్సర్తుం
చరణచాలనం కురుతే,
ధిక్ త్వాం చిత్త! భవాబ్ధే
రిచ్ఛా మపి నో బిభర్షి నిస్సర్తుమ్.

పశువైనను నూతిలో పడుచో బయటకు వచ్చుటకు కాళ్ళు తన్ను ంను. ఓ మనస్సా, నీ వీ సంసారసముద్రములో పడియు బయటపడు పరితపింపకున్నావు కదా!

పంకైర్వినా సరో భాతి
సదః ఖలజనై ర్వినా,
కటువర్ణై ర్వినా కావ్యం
మానసం విషయై ర్వినా.

బురద లేనప్పుడే సరస్సు ప్రకాశించునట్లు, దుష్టులు లేనప్పుడే సభ ంశించునట్లు, కటువర్ణములు లేనప్పుడే కావ్యము ప్రకాశించునట్లు, విష చింతలు లేనప్పుడే మనస్సు నిర్మలమై ప్రకాశించును.

నిష్ణాతో ఽ పి చ వేదాన్తే
సాధుత్వం నైతి దుర్జనః,
చిరం జలనిధౌ మగ్నో
మైనాక ఇవ మార్దవమ్.

దుర్జనుడు వేదాంత శాస్త్రములో నిష్ణాతుడైనను సాధుత్వమును ందదు. మైనాకపర్వతము ఎంతో కాలము నుండి సముద్రపు నీటిలో ునిగియున్నను మెత్తబడుట లేదు కదా!

ఈశః కరస్థీకృత కాంచనాద్రిః
కుబేరమిత్రో రజతాచలస్థః,
తథాపి భిక్షాటన మస్య జాతం
విధౌ శిరస్థే కుటిలే కుతః శ్రీః.

శివుని చేతిలో బంగారు మేరు పర్వతము గలదు. ఆతడు నివసించు నది వెండి కొండ. అతని మిత్రుడు ధనాధిపతియైన కుబేరుడు. అట్లయి నను ఆ శివునకు భిక్షాటనము తప్పలేదు. నెత్తిని విధి అననుకూలముగా నున్నచో నైశ్వర్య మెట్లు పట్టును?

సుఖస్య దుఃఖస్య న కోఽపి దాతా
పరో దదాతీతి కుబుద్ధి రేషా,
అహం కరోమీతి వృథా భిమానః
స్వకర్మ సూత్రగ్రథితో హి లోకః.

సుఖమునుగాని దుఃఖమును గాని యెవడును గల్గింప జాలడు. ఎవడో వీనిని గల్గించుచున్నా డను కొనుట పొరపాటు. నే నేదో చేయుచున్నా ననుకొనుటయు వృథాభిమానమే. ప్రతిమానవుడును తన కర్మ సూత్రము చేతనే గ్రథితుడై యున్నాడు.

కలా సీమా కావ్యం సకలగుణ సీమా వితరణం
భయే సీమా మృత్యుః సకలసుఖ సీమా సువదనా,
తపస్సీమా ముక్తిః సకలకృతి సీమా శ్రితభృతిః
ప్రియే సీమా హ్లాదః శ్రవణసుఖ సీమా హరికథా.

కళకు పరమావధి కావ్యము. సకల సద్గుణములకు పరమావధి దాన గుణము. భయములకు పరమావధి మృత్యువు. సకల సుగుణములకు పరమావధి స్వీయకాంత. సర్వ తపస్సులకు పరమావధి మోక్షము. సమస్తసత్కార్యములకు పరమావధి యాశ్రితులనుపోషించుట. సమస్తప్రియుల పరమావధి యాహ్లాదము. సమస్త శ్రవణానందములకు పరమావధి పరమేశ్వరకథా శ్రవణము.

* * *

# వ్యాసమహర్షివాణి

## మహాభారతము - స్త్రీ పర్వము

(విదురుడు ధృతరాష్ట్రునకు చెప్పినది)

కశ్చిన్మహతి కాంతారే
వర్తమానో ద్విజః కిల,
మహద్దుర్గ మనుప్రాప్తో
వనం క్రవ్యాద సంకులమ్.

సింహ వ్యాఘ్రగజర్క్షౌఘై
రతిఘోరం మహాస్వనైః,
పిశితాదైరతిభయై
ర్మహోగ్రాకృతిభిస్తథా. (పంచమాధ్యాయము 3.4)

ఒకానొక ద్విజుడు మహారణ్యములో సంచరించుచు క్రూర మృగ సంకులమైన దుర్గమ భయంకర వనమున నొక దానిని చేరెను. అచట భయంకర ఘాతుక మృగములు పెల్లుగా నార్చుచుండెను.

[జీవుడు సంసార సాగరములోపడుట, తుదకు ఇంద్రియ నిగ్రహము, భూతదయ మున్నగు వానిచే నంతఃకరణ శుద్ధిని సంపాదించుకొని ముక్తుడగుట - ఇందలి విషయము. ఇచట ద్విజుడనగా అవిద్యా కర్మలనెడి రెండింటి వలనను జన్మము నెత్తిన వాడు. వన మనగా సంసారము. ఘాతుక మృగములే వ్యాధులు.]

సమంతా త్సంపరిక్షిప్తం
యత్స్మ దృష్ట్వా త్రసేద్యమః,
తదస్య దృష్ట్వా హృదయ
ముద్వేగ మగమ త్పరమ్.

అభ్యుచ్ఛ్రియం చ రోమ్ణాం వై
విక్రియాశ్చ పరంతప,
పతద్వనం వ్యనుసరన్
సంప్రధావ న్నితస్తతః. 5-6

ఆ వనము నలుదిక్కుల వ్యాపించి, యమునకు కూడ భయము గల్గించు నట్లుండెను. దానిని చూడగా నా ద్విజునకు భయ ముప్పతిల్లెను. రోమాంచము గల్గెను; బహువిధ వికారములు గల్గెను. అతడా వనము ననుసరించుచు నటు నిటు పరుగిడు చుండెను.

వీక్షమాణో దిశ స్సర్వాః
శరణం క్వ భవేదితి,
స తేషాం ఛిద్ర మన్విచ్ఛన్
ప్రద్రుతో భయపీడితః.
న చ నిర్యాతి వై దూరం
న వా తై ర్విప్రముచ్యతే,
అథాఽ పశ్యద్వనం ఘోరం
సమంతా ద్వాగురావృతమ్. 7-8

అతడు నలుదిక్కులు చూచెను. నాకు గతి యేదియని వెదుక జొచ్చెను. బయటకు పోవుటకు సందు దొరకునా యని చూచెను; భయపీడితుడై పరుగిడెను. తప్పించుకొని దూరముగా బయటకు రాజాలక పోయెను. అందుండి విడుదల పొందజాలకపోయెను. ఆ వనమందంతటను ఉచ్చులు పన్నబడి యుండెను. (ఇచ్చట విషయ తృష్ణా వాసనలే ఉచ్చులు.)

బాహుభ్యాం సంపరిక్షిప్తం
స్త్రియా పరమఘోరయా,
పంచశీర్షధరై ర్నాగైః
శైలై రివ సమున్నతైః.
నభస్స్పృశైర్మహావృక్షైః
పరిక్షిప్తం మహావనమ్,
వనమధ్యే చ తత్రాఽ భూ
దుదపానః సమావృతః. 9-10

పరమ ఘోరాకారయైన యొక స్త్రీ తన బాహువులచే నా ప్రదేశమును చుట్టెను. మరియు అయిదు తలలు గల్గి పర్వతములంత యెత్తైన సర్పము లచేతను, ఆకాశమును స్పృశించు మహావృక్షముల చేతను ఆ ప్రదేశము ఆవరింపబడి యుండెను. ఆ వనమునకు నడుమ నొకబావి యుండెను.

ఇచ్చట స్త్రీయే వార్ధకము. అది యెప్పుడో యెల్లరను పట్టుకొనుట నిశ్చితము.

వల్లీభి స్తృణచ్ఛన్నాభి
ర్గూఢాభి రభిసంవృతః,
సపాత స ద్విజ స్తత్ర
నిగూఢే సలిలాశయే.

విలగ్నశ్చాఽ భవ త్తస్మిన్
లతాసంతాన సంకులే,
సనసస్య యథాజాతం
వృంతబద్ధం మహాఫలమ్. 11-12

ఆ బావి దట్టములైన తీగలచేత కప్పబడి యుండెను. ఆ తీగెలు గడ్డిపరకలచే నలముకొనబడియుండెను. ఆ బ్రాహ్మణు డా నూతిలో పడెను. దట్టముగానున్న తీగెలలో తగుల్కొన్న వాడై తలక్రిందుగా పనస కాయ తొడిమనుండి కిందికి వ్రేలాడునట్లు వ్రేలాడెను.

దేహాద్యభిమానముచే జీవుడు అందు బద్ధుడగుటయే యిచ్చట తీగెలలో తగుల్కొనుటగా చెప్పబడినది. కూపమే దేహము.

స తదాలంబతే తత్ర
హ్యూర్ధ్వపాదో హ్యధ శ్శిరాః,
అథ తత్రాపి చాన్యోఽస్య
భూయో జాత ఉపద్రవః. 13

కాళ్ళుపైకి తల క్రిందకు నుండు నట్లాతడు వ్రేలాడెను. దానికి తోడు మరొక ఉపద్రవము కూడ నాతని కక్కడ సంభవించెను.

జీవుడు స్వర్గములోనుండి భ్రష్టుడై, యీ భూలోకమునకు తిరిగి వచ్చుటయే, తలక్రిందులుగా బావిలో పడుటగా చెప్పబడినది.

కూపమధ్యే మహానాగ
మపశ్యత మహాబలమ్,
కూపవీనాహ వేలాయా
మపశ్యత మహాగజమ్.

షడ్వక్త్రం కృష్ణ శుక్లంచ
ద్విషట్క పదచారిణమ్,

క్రమేణ పరిసర్పన్తం
వల్లీ వృక్ష సమావృతమ్. 14-15

అతడు కూపమధ్యమున గొప్ప బలము గల నాగసర్పమును చూచెను; మరియు ముఖ బంధనోపరితలమున మహా గజమును చూచెను. ఆ గజమునకు ఆరు ముఖములు, పండ్రెండు పాదములు నుండెను. అది శుక్ల కృష్ణ వర్ణములు గలదై, లతా వృక్ష సమావృతమై నెమ్మదిగా నడచుచుండెను.

కాలము దొరలుటచే జీవితము క్షయ మగుచున్నది. ఇచ్చట గజమే సంవత్సర కాలము. ఆరు ముఖములు ఋతువులు. పండ్రెండు పాదములే మాసములు. తెలుపు నలుపులే శుక్ల కృష్ణ పక్షములు. వృక్షమే ఆయువు. లతయే జీవితాశ.

తస్య చాఽపి ప్రశాఖాసు
వృక్షశాఖావలంబినః,
నానారూపా మధుకరా
ఘోరరూపా భయావహాః.
ఆసతే మధు సంవృత్య
పూర్వమేవ నికేతజాః,
భూయో భూయస్సమీక్షన్తే
మధూని భరతర్షభ. 16-17

వృక్షశాఖల మీద వివిధ రూపములయిన తేనెటీగలు భయంకరముగా నుండెను. అక్కడనే పుట్టి పెరుగుచున్న యా మధుకరములు తేనెను చుట్టువారుకొని యుండి యింకను తేనెలకొఱకు ఆశించుకొని యున్నవి.

వృక్ష శాఖలే బాల్యయౌవనాద్యవస్థలు, తేనెటీగలే కామరసమును గోరు ఇంద్రియగణములు. ఇచట తేనెలే కామములు.

స్వాదనీయాని భూతానాం
యైర్బాలో విప్రకృష్యతే,
తేషాం మధూనాం బహుధా
ధారాం ప్రస్రవతే తదా.
ఆలంబమాన స్స పుమాన్
ధారాం పిబతి సర్వదా,

న చాస్య తృష్ణా విరతా
పిబమానస్య సంకటే. 18-19

ఆ తేనెలు సర్వప్రాణులకును రుచ్యములుగా నుండెను. అవి ప్రాణుల బలమును లాగివైచుచున్నవి. ఆ తేనెల ధార యటునిటు ప్రవహించు చుండెను. ఆ పురుషు డా మధుధారను పట్టి త్రాగుచుండెను. కాని యా సంకటస్థితిలో వాడెంత త్రాగుచున్నను దప్పిక తీరుటలేదు.

ఇంద్రియసుఖము నెంత యనుభవించినను జీవుడు తృప్తి నొందదు. ఆత్మానందమే తుద కాతనిని తృప్తి పఱచును.

అభీప్సతి తదా నిత్య
మతృప్త స్స పునః పునః,
న చాస్య జీవితే రాజన్
నిర్వేద స్సమాజాయత.
తత్రైవ చ మనుష్యస్య
జీవితాశా ప్రతిష్ఠితా,
కృష్ణాః శ్వేతాశ్చ తం వృక్షం
కుట్టయన్తి చ మూషికాః. 20-21

ఆ పురుషు డా మధుధారచే తృప్తి నొంద జాలక, మరల మరల దానినే కోరుచుండెను. వానికి జీవితముపై వైరాగ్యము గలుగుటలేదు. మీదు మిక్కిలి యక్కడనే జీవితాశ ప్రతిష్ఠితమై యున్నది. ఆ వృక్షమును తెలుపు నలుపు రంగులు గల మూషికములు కొరుకు చున్నవి. (ఆ మూషికములే యహోరాత్రములు.)

వ్యాళైశ్చ వనదుర్గాన్తే
స్త్రియా చ పరమోగ్రయా,
కూపాధస్తాచ్చ నాగేన
వీనాహే కుంజరేణచ.
వృక్ష ప్రపాతాచ్చ భయం
మూషకేభ్యశ్చ పంచమమ్,
మధులోభా న్మధుకరైః
షష్ఠ మాహు ర్మహ ద్భయమ్. 22-2

ఇట్లా ద్విజున కాఱు భయములు సంప్రాప్తించెను: 1. నల్ల త్రాచు వలన; 2. ఉగ్రరూపయైన స్త్రీ వలన; 3. నాగ సర్పము వలన; 4. ఏనుగు వలన; 5. ఎలుకలు కొఱికి వేయుటచే కూలిపోగల వృక్షము వలన; 6. తేనె నావరించు కొనిన తేనెటీగల వలన.

ఏవం చ వసతే తత్ర
క్షిప్తః సంసారసాగరే,
నచైవ జీవతాశాయాం
నిర్వేద ముపగచ్ఛతి. 24

ఈ రీతిగా సంసార సాగరములో త్రోసి వేయబడిన యా ద్విజునకు జీవితముపై వైరాగ్యము కలుగదాయెను.

ఉపమాన మిదం రాజన్
మోక్ష విద్భి రుదాహృతమ్,
సుకృతం విందతే యేన
పరలోకేషు మానవః.
ఉచ్యతే యత్తు కాంతారం
మహాసంసార ఏవ సః,
వనం దుర్గం హి యచ్చైతత్
సంసారగహనం హి తత్. (షష్ఠాధ్యాయము 4, 5)

ఓ రాజా! ఈ యుపమానము మోక్ష రహస్యము నెఱిగిన వారి చేత చెప్పబడినది. దీనిని గ్రహించుట వలన మానవుడు పరములో పుణ్య ఫలము నొందగలడు.

ఇచ్చట అరణ్య మని చెప్ప బడినది మహా సంసారమే. అందలి దుర్గ మవనము సంసారవనమే.

యే చ తే కథితా వ్యాళా
వ్యాధయస్తే ప్రకీర్తితాః,
యా సా నారీ బృహత్కాయా
అధ్యతిష్ఠతి తత్ర వై.
తామాహు స్తు జరాం ప్రాజ్ఞా
రూపవర్ణ వినాశినీమ్,

యస్తత్ర కూపో నృపతే
స తు దేహః శరీరిణామ్.
య స్తత్ర వసతేఽధస్తా
న్మహాఽహిః కాల ఏవ సః,
అంతకః సర్వభూతానాం
దేహినాం సర్వహార్యసౌ. 6,7,8

త్రాచు పాములుగా చెప్పబడినవి వ్యాధులే. ఆ ప్రదేశముననున్న స్థూల కాయురాలు రూప వర్ణవినాశియైన జరయే.

అచటి బావి శరీరమే. అందు క్రింది భాగముననున్న పాము కాలమే. సర్వప్రాణులయొక్క సర్వస్వమును హరించు యముడే యా సర్పము.

కూపమధ్యే చ యా జాతా
వల్లీ యత్ర స మానవః,
ప్రతానే లంబతే లగ్నో
జీవితాశా శరీరిణామ్.
స యస్తు కూపవీనాహే
తం వృక్షం పరిసర్పతి,
షడ్వక్త్రః కుంజరో రాజన్.
స తు సంవత్సరః స్మృతః. 9-10

కూపమధ్యమున మానవు డే తీగెను పట్టుకొని వ్రేలాడు చున్నాడో యా తీగయే జీవితాశ. అంచున వృక్షమువద్ద తిరుగుచున్న ఆఱు ముఖములు గల యేనుగే సంవత్సరము.

ముఖాని ఋతవో మాసాః
పాదా ద్వాదశ కీర్తితాః,
యే తు వృక్షం నికృన్తన్తి
మూషికాః పన్నగా స్తథా.
రాత్ర్యహాని తు తా న్యాహు
ర్భూతానాం పరిచింతకాః,
యే తే మధుకరా స్తత్ర
కామా స్తే పరికీర్తితాః. 11-12

ఆ ఏనుగు ముఖము లాఱును షడృతువులు. పండ్రెండు పాదములును పండ్రెండు మాసములు. చెట్లను కొరికి వేయుచున్న మూషికములును పాములును ఆహోరాత్రములుగా చెప్పబడుచున్నవి. అచటి తేనెటీగలే కామములు.

యాస్తు యా బహుళో ధారాః
స్రవన్తి మధునిస్రవమ్,
తాం స్తు కామరసా స్విద్యా
ద్యత్ర జీవన్తి మానవాః. 13

అచ్చట ప్రవహించుచున్న తేనె ధారలు కామరసములుగా తెలియ దగి యున్నవి. వాని నాధారముగా చేసికొని మానవులు జీవించుచున్నారు.

ఏవం సంసారచక్రస్య
పరివృత్తిం విదు ర్బుధాః,
యేన సంసారచక్రస్య
పాశాం శ్ఛిందంతి వై బుధాః. 14

సంసారచక్రముయొక్క పరివర్తనమును పండితు లీ రీతిగా తెలిసికొను చున్నారు. దీనిని చక్కగా గ్రహించుకొను వారు వైరాగ్యము గల్గి సంసార చక్రపాశమును భేదింపగలరు.

శ్రుణు భూయః ప్రవక్ష్యామి
మార్గ స్యైతస్య విస్తరమ్,
యచ్ఛ్రుత్వా విప్రముచ్యన్తే
సంసారేభ్యో విచక్షణాః. (సప్తమాధ్యాయము, 2)

ఈ మార్గమును గూర్చి తిరిగి సవిస్తరముగ చెప్పెదను, వినుము. దీనిని తెలిసికొని వివేకులు సంసార బంధములనుండి విడుదల పొందెదరు.

యథా తు పురుషో రాజన్
దీర్ఘ మధ్వాన మాస్థితః,
క్వచిత్ క్వచి చ్ఛ్రమాచ్ఛ్రాంతః
కురుతే వాస మేవ వా.
ఏవం సంసారపర్యాయే
గర్భవాసేషు భారత,
కుర్వంతి బహుధా వాసం
ముచ్యంతే తత్ర పండితాః. 3-4

దీర్ఘ ప్రయాణము చేయు బాటసారి, మార్గ మధ్యమున నచ్చటచ్చట నాగుచు విశ్రాంతి తీసికొనుచుండును. అట్లే చిరకాలము నుండి సంసారయాత్ర సాగించుచున్న జీవుడు, ఆ యా గర్భములలో నివసించుచు జన్మములను గడపుచున్నాడు. పండితులైన వారు మాత్రమే యీ సంసారయాత్రనుండి ముక్తిని పొందుదురు.

తస్మా దధ్వాన మేవైత
మాహుః శాస్త్రవిదో జనాః,
యత్తు పంసార గహనం
వన మాహు ర్మనీషిణః.

సోఽయం లోకసమావర్తో
మర్త్యానాం భరతర్షభ,
చరాణాం స్థావరాణాం చ
న గృధ్యేత్తత్ర పండితః.

కనుక శాస్త్రవేత్త లీ సంసారమును ప్రయాణముతో పోల్చినారు. వనమని చెప్పబడినది యీ సంసారారణ్యమే. సకల చరాచరములకును ఈ సంసార పరిభ్రమణము కలదు. పండితుడైన వాడిందు చిక్కుకొనరాదు.

శారీరా మానసా శ్చైవ
మర్త్యానాం యే తు వ్యాధయః,
ప్రత్యక్షా శ్చ పరోక్షా శ్చ
తే వ్యాలాః కథితా బుధైః.

క్లిశ్యమానా శ్చ తైర్నిత్యం
వార్యమాణాశ్చ భారత,
స్వకర్మభి ర్మహావ్యాలై
ర్నోద్విజన్త్యల్పబుద్ధయః.

పైకి కన్పట్టు నట్టియు, కన్పడ నట్టియు, సకల శారీర మానస వ్యాధులు, త్రాచు పాములుగా చెప్పబడినవి. స్వకర్మవశమున వానిచే అడ్డగింపబడుచును, బాధింపబడుచును గూడ అల్పబుద్ధు లగువారు వానిని తప్పించుకొను ఉపాయము నన్వేషింపరు.

అథాపి తైర్విముచ్యేత
వ్యాధిభిః పురుషో నృప,

ఆవృణోత్యేవ తం పశ్చా
జ్జరా రూపవినాశినీ.

ఓ రాజా! ఆ వ్యాధులనుండి విమోచము నొందినను, పిదప రూప వినాశియగు వార్ధకము వారి నాక్రమించును.

శబ్ద రూప రస స్పర్శై
ర్గంధైశ్చ వివిధైరపి,
మజ్జా మాంస మహాసంకే
విరాలంబే సమంతతః. 10

సంవత్సరాశ్చ మాసాశ్చ
పక్షాఽహో రాత్ర సంధయః,
క్రమేణాఽస్యోపయుంజంతి
రూప మాయు స్తథైవచ. 11

స్థిర ప్రతిష్ఠితములు కాని మజ్జా మాంసాదు లనెడు బురదలో చిక్కు కొని, శబ్దస్పర్శ రూప రస గంధముల నను భవించుచున్న ప్రాణుల రూపమును, ఆయువును మాస పక్ష సంవత్స రాహోరాత్రములు క్షయింప చేయుచున్నవి.

ఏతే కాలస్య నిధయో
నైతాన్ జానన్తి దుర్బుధాః,
ధాత్రాఽభిలిఖితా న్యాహుః
సర్వభూతాని కర్మణా.

ఇవి కాలముయొక్క సాధనములు. బుద్ధిహీనులు వీని తత్త్వము నెఱుగరు. కర్మానుసారముగా సర్వప్రాణుల చరితము బ్రహ్మచే నిర్ణీత మైయున్నది.

రథ శ్శరీరం భూతానాం
సత్త్వ మాహుస్తు సారథిమ్,
ఇంద్రియాణి హయా న్యాహుః
కర్మబుద్ధిస్తు రశ్మయః. 13

తేషాం హయానాం యో వేగం
ధావతా మనుధావతి,
స తు సంసార చక్రేఽస్మిన్
చక్రవత్పరివర్తతే. 14

ప్రాణులకు ఈ శరీరము రథమువంటిది. బుద్ధియే సారథి. ఇంద్రియములు గుఱ్ఱముల వంటివి. మనస్సే పగ్గములు.

ఎవడు ఇంద్రియాఽశ్వములు లాగినట్లు వేగముగా పరుగిడునో వాడు సంసార చక్రముతో బాటు గిరగిర తిరుగుచుండును.

యః స్తాన్ సంయమతే బుద్ధ్యా
సంయతో న వివర్తతే,
న తు సంసార చక్రేఽస్మిన్
చక్రవత్పరివర్తతే. 15

ఎవడు తనబుద్ధిచేత నింద్రియములను నిగ్రహించుకొని, వాని వైపునకు మరలడో, వాడు మరణానంతరము తిరిగి జన్మము నెత్తడు. ఈ సంసారచక్రములో బడి తిరుగడు.

భ్రమమాణా న ముహ్యంతి
సంసారే న భ్రమన్తి తే,
సంసారే భ్రమతాం రాజన్
దుఃఖ మేతద్ధి జాయతే. 16

సంసారములోనుండియు మోహము చెందని వారు, చక్రము వలె తిరుగని వారై, శాంతిలో నుండగలరు. సంసారచక్రములో భ్రమించు వారికి దుఃఖము తప్పదు.

తస్మాదస్య నివృత్త్యర్థం
యత్న మేవాచరే ద్బుధః,
ఉపేక్షా నాత్రకర్తవ్యా
శతశాఖః ప్రవర్ధతే.

కావున సంసార భ్రమణము తొలగుటకై, పండితుడగు వాడు ప్రయత్నము చేయవలయును. ఈ విషయమై ఉపేక్షచేయరాదు. ఉపేక్షించుచో నీ సంసార వృక్ష మింకను పెరిగి పోగలదు.

యతేంద్రియో నరో రాజన్
క్రోధలోభ నిరాకృతః,

సంతుష్టః సత్యవాదీ యః
స శాంతి మధిగచ్ఛతి. 18

ఓ రాజా! ఎవడు ఇంద్రియ నిగ్రహము గలవాడో క్రోధ లోభము లను వీడునో నిరంతరము సంతుష్టాంతరంగుడై యుండునో, సత్యమునే పల్కుచుండునో యా నరుడు శాంతిని పొందును. యమలోక ప్రాపకమైన శరీరము పట్ల నవివేకులు మోహము నొందుచున్నారు. ఓ నరాధిపా! అట్లు మోహము చెందని వాడు నీ విపుడు పొందిన దుఃస్థితిని పొందదు.

ఆర్య! రాజ్యనాశము, పుత్ర మిత్ర నాశము మున్నగు దుఃఖజాతము తృష్ణాశీలమగు మోహమువల్లనే సంప్రాప్త మగుచున్నది.

సాధుః పరమ దుఃఖానాం
దుఃఖభైషజ్య మాచరేత్!
జ్ఞానౌషధ మవాప్యేహ
దూరం పారం మహౌషధమ్. 21

ఛింద్యా ద్దుఃఖ మహావ్యాధిం
నర స్సంయతమానసః.

సత్పురుషు డీ మహాదుఃఖముల చికిత్సను చేసికొనవలయును. బ్రహ్మ జ్ఞానమే యీ సంసారదుఃఖమున తిరుగులేని మహౌషధము. మనో నిగ్రహము గల్గి మానవుడు దుఃఖమనెడు మహావ్యాధిని జ్ఞానౌషధముచే కుదుర్చుకొన వలయును.

న విక్రమో న చాప్యర్థో
న మిత్రం న సుహృజ్జనః,
తథోన్మోచయతే దుఃఖా
ద్యథాఽత్మా స్థిరసంయమః. 22

పరాక్రమముకాని ధనము కాని యేవిధమైన స్నేహితులుకాని యీ సంసార దుఃఖమును తొలగింప జాలరు. తుచ్ఛవిషయములనుండి శాశ్వత ముగా మరలింప బడిన మనస్సే యీ దుఃఖమును తొలగింప గలదు.

అంతఃకరణములోని యజ్ఞాన మాలిన్యము పోయి జ్ఞానోదయము గలుగ వలయునన్నచో కొన్ని సాధనములు కలవు. ఆ సాధనము లెవ్వియనన--

తస్మాన్మైత్రం సమాస్థాయ
శీలమాపద్య భారత,
దమస్త్యాగోఽప్రమాదశ్చ 23
తే త్రయో బ్రహ్మణో హయాః.

సర్వ భూతమైత్రిని సచ్ఛీలమును సంపాదించు కొనవలయును. త్యాగమును ఇంద్రియనిగ్రహమును అలవఱచుకొనవలయును. ఏమరుపాటు లేకుండ నుండవలయును. దమము, త్యాగము, అప్రమాదము అనునీ మూడును బ్రహ్మ లోకప్రాప్తిని కల్గించును (మరియు 18వ శ్లోకములో చెప్పబడినట్లు ఇంద్రియనిగ్రహము, క్రోధ, లోభ పరిత్యాగ సంతుష్టి, సత్యసంధతలను గుణములు శాంతి సాధనములు.)

శీలరశ్మి సమాయుక్తః
స్థితో యో మానసే రథే,
త్యక్త్వా మృత్యుభయం రాజన్ 25
బ్రహ్మలోకం స గచ్ఛతి.

ఏ మానవుడు ఉత్తమశీలమను పగ్గమును చేతబట్టి మానసరథము నధిష్ఠించునో వాడు మృత్యుభయమును వీడి బ్రహ్మలోకమును పొందును.

అభయం సర్వభూతేభ్యో
యో దదాతి మహీపతే,
స గచ్ఛతి పరం స్థానం 26
విష్ణోః పద మనామయమ్.

ఓ మహీపతీ, సర్వ భూతములకు అభయ మొసగువాడు దుఃఖ రహితము, పరమోత్కృష్టము నగు విష్ణు పదమును పొందును.

న త త్క్రతుసహస్రేణ
నోపవాసైశ్చ నిత్యశః,
అభయస్య చ దానేన 27
యత్ఫలం ప్రాప్నుయాన్నరః.

వేయి యజ్ఞముచేతను, నిత్యోపవాసములచేతను పొందజాలని ఫలమును నరుడు అభయప్రదానముచేత పొందగల్గుచున్నాడు.

న హ్యాత్మనః ప్రియతరం
కశ్చి ద్భూతేషు విశ్చితమ్,
అనిష్టం సర్వభూతానాం
మరణం నామ భారత.
తస్మా త్సర్వేషు భూతేషు 28
దయా కార్యా విపశ్చితా.

ఎవరికిని ఆత్మ కంటె ప్రియమైన వస్తువు లేదు. మరణము ఏ ప్రాణికిని సమ్మతము కాదు. కావున నే ప్రాణికిని మరణమును గల్గింపరాదు. సర్వభూతముల పట్లను దయను నెఱప వలయును. ఆత్మజ్ఞానము నొంది, మృత్యువును జయించి, బ్రహ్మలోకము నొందగోరు వాడు ముందుగా ప్రాణులకు భౌతిక మృత్యువును గాని యితర బాధలనుగాని కల్గింపకుండ ప్రవర్తింప వలయును.

అసూక్ష్మ దృష్టయో మందా
భ్రామ్యంతే తత్ర తత్ర హ,
సుసూక్ష్మ దృష్టయో రాజన్
వ్రజంతి బ్రహ్మ శాశ్వతమ్.

ఓ రాజా! మందబుద్ధులు సంసారములో పడి, మోక్షోపాయముల నన్వేషింపజాలరు. మోక్షవాంఛకు గాని, యుపాయాన్వేషణానుసరణములకు కాని సత్త్వగుణము మిక్కుటముగా నుండవలయును. సత్త్వగుణ విరాజితులే సూక్ష్మబుద్ధి గలిగి మోక్షోపాయముల ననుసరించి శాశ్వత బ్రహ్మప్రాప్తి నొందెదరు.

* * *